# ఇండియా

డాక్టర్ అహ్మద్




అనువక్త:
హారేసముద్రం నరసింగరావు.

# తొలి పలుకు

అక్టోబరు 2, 1939

ఏపనైనా అనుకున్నంత ప్రోత్సాహం లేకపోయినప్పుడు కాస్త కుంటుపడుతూండడం పరిపాటే. కాని అంతమాత్రంతో వెనక్కిపోకుండా ముందుకు తోసుక పోతూండక తప్పదుగదా !

మేమీ గ్రంథమాలను స్థాపించి దాదాపు రెండేళ్ళు — 1938 జనవరిలో — కావస్తున్నాయి. మేమనుకున్న ప్రకారం అనుకున్నన్ని పుస్తకాలు వెలువర్చలేక పోయాము.

పుస్తకాలేమో చాలభాగం అమ్ముడుపోయినవి; కానీ యేజంట్ల ద్వారా అమ్ముడుపోయినవాటికే యింకా పూరా డబ్బు రాలేదు. వారితో వసూలుచేసుకోవడం గళబద్ధంగా ఉంది. మొదలే జాగ్రత్తపడి ఉండవలసింది. గోడదెబ్బా చెంపదెబ్బా తగిలితేనేకదూ తెలిసేది.

చందాదారులను మేమెక్కువగా చేర్చలేదు.

వీరాళోలు సుమారుగా వచ్చినవి. వారందరికీ మేమెంతో కృతజ్ఞులమని వేరే చెప్పనక్కరలేదు.

చందాదార్లకు మేము పుస్తకాలు నిదానంగా అచ్చువేయడంవల్ల వచ్చిన నష్టమేమాత్రము లేదు. మూడురూపాయల చందాకు ఆరుపుస్తకా లిస్తున్నాము సరే; ఒకటే సంవత్సరంలో ఆరుపుస్తకాలూ – పెద్దవి – ప్రకటించలేకపోయాము; అందుకే మరీ సంవత్సరం చందా యింకా వసూలు చేయలేదు. యిప్పటికి 'యిండియా' అనే పుస్తకంతో పూర్తి వారి డబ్బు తీరిపోతుంది. ఇంక మరీ వసూలు చేసుకుంటాము.

ఈసారి యెక్కువమంది చందాదారులను చేర్చాలనీ వారిమీదనే విడిపుస్తకాలు కొనేవారి మీదకన్నా యెక్కువ ఆధారపడాలనీ అనుకున్నాము.

నియమాలు కొన్ని మార్చుకొన్నాము. చందా మూడు రూపాయలనుండీ రెండు రూపాయలకూ, ఆరు పుస్తకాలనుండీ నాల్గుపుస్తకాలకూ తగ్గించినాము. ప్రతి అక్టోబరు – జనవరి – ఏప్రెల్ – జూలై నెలల్లో ఒకో పుస్తకం వెలువరుస్తాము. అలా వీలుకాకపోతే అంతా

నాల్గుపుస్తకాలూ అందించండి రెండో చందా వసూలు చెయ్యము. ఏమో యీమాట మాత్రము నిలుస్తుందా అంటారా! ఆభారం మీదే. కొనేవాళ్ళనుబట్టేకదూ!

యిప్పటికి ప్రకటించిన పుస్తకాలు ఏడు. ఇందులో పాసిజం, లెనిన్, ఆస్ట్రియా పూర్తి అయిపోయినవి.

1. ఫాసిజం
2. లెనిన్
3. ఆస్ట్రియా
4. మాస్కో 1937
5. ఏమిచెయ్యడం ?
6. పాపం !
7. ఇండియా (సరి కొత్తది)

ఈపుస్తకం ఆలిండియా కాంగ్రెసు కమిటీవారు ప్రకటించినారు. ఇందులో బ్రిటీషువారి పరిపాలనతో మనదేశం యెట్లా క్షీణించిపోతూందో చాలచక్కగా వివరించినారు అహ్మద్ గారు. వారిని గురించిగానీ పుస్తకాన్నిగురించిగాని పొగడ్త లనవసరం. దీన్ని అనువదించి యిచ్చిన నరసింగరావుగారికి కృతజ్ఞులము.

ఇంకమీద కథలూ, నాటకాలూ. వ్యాసాలూ, అన్నీ కలిపిన సంపుటాలూ ఒక టేమిటి నవనవలాడుతూన్న నవీన హృదయాలను నాట్యం చేయిస్తూ నవయుగ నిర్మాణాని కనుకూలించే నవ్యసాహిత్యాన్నంతా ప్రక టిస్తాము. అభిలాషలన్నీ ఆచరణలేకి తెచ్చుకొంటేనే గదా! ఆనందం. అందుకే అన్నివిధాలా ప్రయ త్నిస్తాము

ఏవేవో పనులతో - అందులో దిగడం అధిక ప్రసంగమే అయినా అవసరమేగనుక - ఇన్నాళ్ళూ సరి పోయింది. ఇంకమీద నా కాలాన్నంతా యిందుకే వుపయోగించ దలచుకొన్నాను. అన్నిటినీ - యిందుకు ప్రతిబంధకం లేకుండా - వదలుకొని అచ్చం సారస్వత సేవకుణ్ణిగా, తత్త్వ చింతకుణ్ణిగా మారిపోతున్నాను. కలమూ గళమూ తప్పితే నిలవగలిగిందేముంది నాకు.

పరిచయాన్నీ, పలుకుబడినీ కొంచెం వుపయోగిం చామంటే కథ అడ్డం తిరుగుతుంది. అందుకే భయం. ఇదేం నా ఒక్కనికోసం చేసే పనికాదు. బొత్తిగా స్వార్థంలేదని చెప్పడానకి వీల్లేమలే. ఏదో పేరో ప్రతిష్ఠో రానూ రావచ్చు. కానీ కేవలం ఉదరపోషణ

కోసం వేసినయెత్తు మాత్రం కాదని రూఢిగా చెప్పొచ్చుగదా!

పెద్ద సిద్ధాంత విభేదాలూ వ్యక్తిగత వైరాలూ యిందులో పాటించవలసిన పనిలేదు. ఇంకమీద అన్నిరకాలైన అభివృద్ధికర వాఙ్మయమంతా అందిస్తాము. కేవలం యిది మనోవికసన ప్రయత్నం. ఏపార్టీ వారైనా చదవాలిసినవే యీపుస్తకాలు. తిండెట్లా శరీరాన్ని పోషిస్తుందో సారస్వతమట్లా మనోబుద్ధులకు బలమిస్తుంది.

ఇందుకు ప్రతివాళ్ళూ సాయం చేస్తారని పరిపూర్ణంగా విశ్వసిస్తున్నాము. ఆంధ్రప్రాంతంలోనే యిట్టి సంస్థలు తక్కువ. మన ప్రాంతంలో మరీ సున్న. ఇదైనా బ్రతకనియ్యండి. అది ప్రతివారి విధి అని మనవి.

ఊ అంటారా? ఊహూఁ అంటారా? చెప్పండి.

విశ్వం,

అనంతపురము. సంపాదకుడు.

1921

# బ్రిటిషువారి

# వలసరాజ్య పరిపాలనా పద్ధతి

బ్రిటనుయొక్క ఆర్థిక రాజకీయ పరిణామము మొట్ట మొదట ఈస్టు ఇండియా కంపెనీల వంటి వ్యాపారస్తుల చేతులం దుండినది. ఇట్టి వ్యాపారసంఘముల సలహాలమేరకు బ్రిటనుయొక్క ఆర్థిక సూత్రము లప్పటప్పటికి మారుచుండెడివి. పదిహేడు పదునెనిమిదవ శతాబ్దములందు బ్రిటనుయొక్క ఆర్థిక రాజకీయ రంగమునందు యీ వ్యాపారసంఘములే యెక్కువ పలుకుబడి కలిగి తమయొక్క వ్యాపారాభివృద్ధికిన్ని, ద్రవ్య సంపాదనకున్ను, అనుగుణముగా రాచకార్యములు జరుపుచుండెడివి. తమ యధీనమందున్న కాలనీలలోని ద్రవ్యమును దోచుటే యీ వర్తకసంఘముల ముఖ్యోద్దేశము. అందుకై యీ వ్యాపార సంఘములు తమ యొక్క వ్యాపారముల కనువగు అధికారము లను, చట్టములను, తమకుగల రాజకీయ పలుకుబడిచే సంపా దించు కొనువారు. ఇట్టి యనుకూలములను పొంది యీ కం పెనీలు తమయొక్క కాలనీల నుండి ద్రవ్యము దోచి దోచి, రానురాను కుబేరులై పంతొమ్మిదవ శతాబ్దమునందు బ్రిటనుదేశపు ఆర్థిక రాజకీయ చక్రవర్తులై నేటికిని బ్రిటిషు రాజ్యతంత్రమును

నడపుచున్నారు. అమెరికా దేశము తనయొక్క సరకులన్నియు బ్రిటిషు ఓడలయందే యెగుమతి చేయవలయునని శాసించిరి. హిందూదేశమునుండి బంగారు, వెండి, వాసనద్రవ్యముల యెగుమతుల కధికారములుబడసి లెక్కలేనంత డబ్బు సంపాదించిరి.

బ్రిటను దేశమందలి చేతిపనుల ప్రాముఖ్యత నశించి యంత్రప్రాబల్యము కలిగినతోడనే యీ వ్యాపారచక్రవర్తులు తమ ద్రవ్యమును యీ యంత్ర పరిశ్రమలపైన పెట్టుబడి పెట్టిరి. అందుకు తగినరీతి బ్రిటిషు రాజకీయ, ఆర్థిక సూత్రములు మార్చబడినవి. బ్రిటనుకు, తాను యంత్రములవల్ల తయారుచేసిన సామానులను అమ్ముటకు వలయు మార్కెట్లున్ను, మిల్లులలో పనిచేయువారికి కావలసిన భోజన పదార్థములున్ను, యంత్రములకు కావలసిన ముడిపదార్థములున్ను, కావలసి వచ్చినవి. అందుకై తనకాలనీలయం దిదివఱకు నుండిన చేతిపరిశ్రమలు పూర్తిగా ధ్వంస మొనర్పబడినవి. పండిన యాహార పదార్థములను యెగుమతి చేసుకొనుటకు అనుకూలమగు శాసనములు గావింపబడినవి. ఇందునిమిత్తమై భారత దేశము బ్రిటిషురాజ్యములో చాల ముఖ్యమైనదిగా పరిగణింపబడుచు వచ్చినది.

1850 వ సంవత్సరమునకు బ్రిటిషురాజ్యపాలన మంతయు సాహుకార్ల చేతిలోనికి వచ్చినది. అయితే తమ కాలనీలయందు రైల్వే మొదలగు ప్రయాణ సౌకర్యములు లేనందువల్ల బ్రిటిషు కాలనీ వ్యాపారమున కాటంకము కలిగినది. ఇది

గ్రహించి ఇండియా ఆఫ్రికా దేశములందు తమ ద్రవ్యమును పెట్టుబడిపెట్టి రైల్వే మొదలగు నవీన ప్రయాణ సౌకర్యమునీ వర్తక చక్రవర్తులు కల్పించుకొన్నారు. అందుమూలాన బ్రిటిషు షాహుకార్లకు తమ ద్రవ్యమున కెక్కువ వడ్డీ దొరకినది. ఇతరదేశములు బ్రిటనుతో పోటీతగిలి పడిపోయినవి. పరాధీన దేశమగు భారతదేశమునందు బ్రిటిషు సాహుకార్లు తమ డబ్బును రైల్వేల యందును,గనులయందును పెట్టుబడిపెట్టి విపరీతపు వడ్డీ సంపాదింప మొదలిడిరి. అందువల్ల బ్రిటను కాలనీల వ్యాపార సిద్ధాంతమునందు మార్పువచ్చినది. తమకు కావలసిన ముడిపదార్థముల నెగుమతి చేయుటేకాక తమ కాలనీలు తమయొక్క ద్రవ్యమునకు వడ్డీ అచ్చుకోవలసిన స్థితి వచ్చినది. రాను రాను యీవడ్డీ వ్యాపారము మించినది. 1881 వ సంవత్సరమున బ్రిటిషు దేశపు పెట్టుబడిధనము యితరదేశములలో 1250 మిలియన్ పౌనులుండి సంవత్సరమునకు 52 మిలియనుల వడ్డీ వచ్చుచుండినదని అంచనా వేయబడినది, 1915 వ సంవత్సరమునకు బ్రిటిషు పెట్టుబడి ధనము ఇతర దేశములయందు 3805 మిలయను పౌనులై సంవత్సరమునకు 200 మిలియను పౌనులు వడ్డీ వచ్చునదిగా నేర్పడినది, ఇట్టి పెట్టుబడి ధనములో 50% వంతు బ్రిటిషు సామ్రాజ్యము నందే ఉన్నది. 1929 వ సంవత్సరములో చర్చిల్‌గారు బ్రిటిషువారికి యిట్టి పెట్టుబడి ధనముమీద సంవత్సరమునకు 300 మిలియను సౌనులు ఆదాయము వచ్చునని చెప్పినారు. భారతదేశపు స్వాతంత్ర్య

సంపాదన కీపెట్టుబడిధనము తీరని యాటంకము. ఇట్టి డబ్బుచే భారతదేశమున రైల్వేలు వేయబడినవి. వంతెనలు కట్టబడినవి. అందువల్ల యీదేశములో బ్రిటిషువారి వ్యాపారము నిరాటంక ముగా సాగుచున్నది. ఈవ్యాపారధాటి కాగలేక పోటీచేయలేక భారతదేశపు పరిశ్రమలు చచ్చినవి. ఇట్టివానిలో భారతదేశపు దూదిపరిశ్రమ మొదటిది. భారతదేశపు స్వదేశీ పరిశ్రమలైన పొగాకు, చక్కెర, యిటువంటి వానిపైన బ్రిటిషువారు తమ పెట్టుబడి పెట్టలేదు.

భారతభూమిని చాలమంది రాజులు జయించి పాలించిరి. బ్రిటిషువారు యీ దేశమును జయించినది లేదు. ఆర్థికముగా సత్వర మభివృద్ధి చెందుచున్న బ్రిటనుదేశముతో బీద భారత దేముశమును ముడివేయుటవల్ల యీ దేశపు. రాజకీయ, ఆర్థిక, పారిశ్రామిక, నైతిక, సాంప్రదాయముల యందు చాల మార్పులు బలవంతముగా తీసికొని రాబడినవి. తొలి భారతీయ నాగరకత నశించినది, భారత ఆర్థిక సౌష్ఠవము ఛిన్నాభిన్న మైనది. బ్రిటిషువారి సహవాసమువల్ల భారతదేశపు పల్లెటూరి పరిపాలన నశించిపోయినది. ఇందుకుతోడు పల్లెలలో వైషమ్య ములు పెరిగి పల్లెటూరి ఆర్థికపరిస్థితులు తారుమారైనవి. వ్యవ సాయమునకున్ను పరిశ్రమలకున్ను, ఉండవలసిన సంబంధము త్రెంచబడినది. వ్యవసాయము వ్యాపారమైనది, ద్రవ్య సంపా దన కనేక మార్గము లేర్పడినవి. అందువల్ల సాంఘికముగా దేశములో ననేక తెగ లేర్పడినవి. బ్రిటిషు పెట్టుబడి ధనముచే

నితర దేశములు దినదినాభివృద్ధి గాంచుచుండ భారతదేశము దినదినము క్షీణించి పోవుచున్నది. చేతి పరిశ్రమ లీదేశమున నశించి పోవుటచే వ్యవసాయమే యందఱికిని జీవనాధార మైనది. అందుచే దేశమున బీదరికము హెచ్చినది. పదునెనిమిదవ శతాబ్దమున ప్రపంచ మంతటితోను వ్యాపారము సాగించి ధనము గడించుచుండిన యీదేశము నేడు అధోగతి పాలైనది.

ద్రవ్యపు దోపిడినే ముఖ్యసూత్రముగా అనుసరించి ఈస్టిండియా కంపెనీవారు అనేక నీచ ప్రవర్తనలచే యీ దేశ మును వశము చేసికొనిరి, రాజ్యపరిపాలనలో ద్రవ్యసంపాదనా సూత్రమే యిప్పటికిని ముఖ్యముగా ననుసరింప బడుచున్నది, కంపెనీవారి వ్యాపారమువల్ల యీ దేశమునుండి చాల ధనము దోచిరి. హిందూదేశపరిపాలన కంపెనీవారి చేతినుండి చక్రవర్తి చేతికివచ్చినను ద్రవ్యసంపాదనా సూత్రమే పరిపాలనలో ననుసరింపబడుచు వచ్చుచున్నది. ప్రపంచము నందెచ్చటను లేని భూమిశిస్తు యీదేశమున వసూలు చేయబడుచున్నది, ఈస్టిండియా కంపెనీవారు వ్యాపార-నెపమున భారతరాజకీయ రంగమున నీచవృత్తులకు గడంగి ద్రవ్య మార్జించిరి. భారత దేశములోని చేతిపనులచే తయారైన సరకులను యితరులు కొనకుండ శాసించి యట్టి పరిశ్రమలచే జీవించువారిని చంపిరి. కంపెనీవారు తమ పదార్థములకు వెల నిర్ధరించి వానిని భారతీ యులు కొనవలసినదిగా కోరిరి. ఇందుకు యెదురుతిరిగినవారిని హింసించిరి. భారతదేశము నందలి నేతగాండ్రను కంపెనీ

వారు తమ యధీనమం దుంచుకొని వారు తయారుచేయు గుడ్డలను కంపెనీవారికే యివ్వవలసినదని శాసించిరి. ఇందుకు తప్పినచో వారికి జుల్మానావిధించియు, జైలులో పెట్టియు,కొరడాలచే కొట్టియు ననేకవిధముల హింసించిరి. గవర్నర్ జనరలుకూడా యిట్టి వ్యాపారపు కట్టుబాట్లలో ప్రవేశించి ద్రవ్యము సంపాడించిరి. వారన్ హేస్టింగ్సుయొక్క విచారణ యిందుకు నిదర్శనము (Trial of Warren Hastings). హెర్బర్టుస్పెన్సర్ గారు చెప్పిన రీతిగా పంతొమ్మిదవ శతాబ్దమునందలి భారతదేశములోని ఆంగ్లో యిండియనులు ' తిండికై వధించు పక్షులవంటివారు ' (Birds of prey and passage). కంపెనీవారు భారతదేశములో సంపాదించిన ద్రవ్యము నీచమైనదనియు, హింసించి సంపాదించ బడినదనియు, ప్రపంచ చరిత్రలో కని విని యెరుగని అన్యాయమైనట్టి, పాప భూయిష్ఠమైనట్టి మార్గముల ద్వారా ఆర్జించిన ద్రవ్యమని చెప్పినాడు. భారత ప్రజలు కంపెనీవారుచెప్పిన ధరలకే సరకులు అమ్మవలసినదిగాను కొనవలసినదిగాను వుత్తరువులుచేసి, యిందుకు తప్పినవారిని కొరడాలతో కొట్టుచుండిరని విన్సిట్రోటర్ గారు చెప్పినారు. 1757 నుండి 1766 వఱకుకంపెనీవారును, వారి యుద్యోగులును 6000,000 పౌనులు హిందూదేశము నుండి కానుకలు (Gifts) గా స్వీకరించిరి. క్లైవు బెంగాలునవాబు గారినుండి వేయి పౌనులు బహుమానముగా తీసుకొన్నాడు. మెకాలేగారు కంపెనీవారి పరిపాలన నీవిధముగా వర్ణించెను. "కంపెనీలోని నౌకరులు కంపెనీకేకాక తమ స్వలాభము

లకు కూడా ద్రవ్యము సంపాదించిరి. సరకులను చాల యెక్కువ ధరలకు కొనవలసినదిగాను తక్కువ ధరలకు అమ్మవలసినదిగాను భారతీయులను కట్టడిచేసిరి, ఇందునిమిత్తమై కొంతమందిభారతీయులనే ఉద్యోగులుగా నియమించిరి. ఇట్టివారు దేశమునందు చాల అమానుషకృత్యములు గావించిరి. కంపెనీలోని ప్రతి కూలివాడును తనయజమానున కుండునంత యధికారము కలిగియుండెను. యజమానుడు కంపెనీకి మొత్తముపైన నుండు నధికారమునంతయు తానే కలిగి యుండెను. అందువల్లనే కలకత్తాలో విపరీతముగా ద్రవ్యము దోచబడినది. ఇట్టి ద్రవ్యపు దాహమునకు ముప్పది మిలియనుల భారతీయులు బలియైరి. ఇట్టి దారుణపరిపాలన క్రింద ప్రజ లెప్పటికిని వుండలేరు."

కంపెనీవారి భూవిధానం (Land Policy) చాల అన్యాయముగా నుండినది. అందువల్ల అనేకరకములైన చిన్న చిన్న జహగీరుదార్లు బయలుదేరి రైతులను హింసింపజొచ్చిరి. బెంగాలు మదరాసు, సంయుక్త రాష్ట్రములలోని రైతులు తమ తాతముత్తాతల నాటినుండి అనుభవించుచుండిన భూములను, బలవంతముగా తీసికొని అట్టి భూములపైన యేలాటి హక్కుగాని అనుభవము గాని లేనట్టి జహగీరుదార్ల కిచ్చిరి. వీరు ఈష్టిండియా కంపెనీకి యెక్కువ గుత్తచెల్లించవలసి యుండినది. అందుకై వీరికి రైతు సంపాదించున దంతయు నీతి నియమములేని మార్గముల దోచుకొను నధికార మివ్వబడినది. అందువల్ల వ్యవసాయపు పన్నులు యెక్కువగా వేయబడి, వేయబడినదాని

కంటే విపరీతముగా వసూలు చేయబడు చుండెడివి. జమీన్ దారు కంపెనీకి యివ్వవలసిన గుత్త చెల్లించని యెడల నతని జాగీరు యాలము వేయబడి యెక్కువ సవాలుదారునకు యివ్వ బడుచుండెడిది. 1772 వ సంవత్సరమున బెంగాలు కౌన్సిలు అధ్యక్షుడు కోర్టు ఆఫ్ డైరెక్టరుల కీ క్రింది రీతి జాబు వ్రాసినాడు. "నైజాముల పరిపాలనలో జమీన్‌దార్ల నుండి విశేషధనము వసూలు చేయబడుచుండినది. ఇందుకుగాను యీ జమీన్‌దార్లు దోచుకొనుటను అనుమతించినారు. రైతువద్దనుండు ధనమం తయు దోచి సంతృప్తిపడినతరువాత మిగిలిన దానినికూడా దోచుకొనుటకు తమకే యధికార మివ్వబడినది."

కంపెనీవారి పరిపాలనలో భూమిశిస్తు మితిమీరి వేయ బడినది. జమీన్‌దార్లు రైతువద్ద భూమిశిస్తు చాల యెక్కువ గాను, నిర్బంధముగాను వసూలు చేయుచుండిరి. రైతువారి పద్ధతులమీద వసూలుకాబడుచుండిన శిస్తుకై రైతు తానుపండించిన పంటలో సగమువంతు అమ్ముకోవలసియుండినది. బెంగాలు నందు 1764-1765 లో భూమిశిస్తు 81800 పౌనులు వుండి నది. 1765-1766 లో కంపెనీవారి మొదటి సంవత్సరపు పరి పాలనలోనే యీశిస్తు 1470.000 పౌనులకు పెరిగినది. 1790-1791 సం॥ నకు 2680,000 పౌనులైనది. అనగా కం పెనీ వారికి వచ్చుగుత్త 1812-1813 లో 4.9 మిలియనుల నుండీ 1821-1823 నకు 13.6 మిలియను పౌనులకు పెరిగినది. ఈ మొత్తమే 1857-1858 సం॥నకు 15.7 మిలియను పౌనులైనది.

అందు వల్ల భూమిశిస్తు కంపెనీవారికి వచ్చు ఆదాయములో ⅔ భాగ మైనది.

జమీనుదారులకును, కంపెనీవారికిని గుత్తలు యిచ్చుకోలేక పోయినాడు రైతు. అతనికి యిట్టివారిపైన తిరుగుబాటు గావించుటకు శక్తి లేకపోయినది. తన యావత్తూ గుత్తలకై దోచుకోబడిపోగా రైతు కరవువల్లను, రోగములవల్లనుబాధపడుచు తప్పించుకొనుటకు శక్తిలేకపోయినది. 1770 వ సంవత్సరమున బెంగాలులో వచ్చిన కఱవువల్ల 10 మిలియనుల ప్రజలు కూడు లేక మాడి చచ్చిరి. అయినను భూమిశిస్తు మాత్రము తగ్గలేదు, 1772 సంవత్సరమున వారన్‌హేస్టింగ్సు కోర్టు ఆప్ డైరెక్టరుల కిట్లు వ్రాసెను. "1770 వ సంవత్సరపు కరవువల్ల యీ రాష్ట్రములో (బెంగాలు) ⅓ భాగము ప్రజలు చనిపోయిరి. వ్యవసాయము తగ్గినను 1771 సం॥ గుత్త 1768 వ సంవత్సరపు గుత్తకంటె యెక్కువగానే వసూలైనది. కరవు కాలమునందు భూమిశిస్తు తగ్గించవలసినదిగ వుండినదిగాని దౌర్జన్యముచేత తగ్గించకుండ యథారీతిగా వసూలుచేయబడినది."

వ్యాపారమువల్లను, రాజకీయ నెపముతో ననుసరించిన నీచవృత్తులవల్లను, ప్రపంచమునందెచ్చటనులేని భూమిశిస్తు విధానమువల్లను, కంపెనీవారికి లెక్కలేనంత ద్రవ్యము వసూలైనది. ఈద్రవ్యమంతయు బ్రిటను దేశమునకు పంపబడినది. కడచిన శతాబ్దములో ఒక్క సంవత్సరమునకు 3,000,000 పౌనులు

భారతదేశమునుండి బ్రిటను దేశమునకు పంపబడినది. ఇదిగాక 5,000,000 పౌనులను వ్యక్తులు తమవారికి పంపినారు. ఈద్రవ్యపు దోపిడి రానురాను మితిమీరినది. 1835-1839 లో సరాసరి 5,347,000 పౌనుల నుండి 1855—1859 లో 7,730,000 పౌనులకు పెరిగినది. ఈ యెడతెగని దోపిడీ వల్ల భారతదేశమునకు కలిగిన నష్టమును గురించి పూర్వపు యింగ్లీషు వుద్యోగులును, యితరులును యీరీతిగా చెప్పినారు.

దక్కను రివిన్యూకమీషనర్‌గానుండిన శావిలీమారియట్ (Saveli Marriot) గారు 1836 సంవత్సరమున సర్ ఆర్ గ్రాంటు (Sir R Grant) గారికి యిట్లు వ్రాసినారు. "చాల దినములుగా నేను నశించిపోవుచున్న యీప్రజలను చూచుచున్నాను. అందులో ముఖ్యముగా రైతులు నశించిపోవుచున్నారు. బీదరికమువల్లను, యితర విధములైన యిక్కట్లవల్లను కష్టపడుచుండు రైతుకు ఇప్పటి యీ బ్రిటిషు పరిపాలనకంటే తమ దేశీయ రాజుల పరిపాలన క్రిందనే సౌఖ్యముగా నుండినదని చెప్పవలయును. పూర్వముకంటె యిప్పుడు దేశము 'పాప'మైనది. పూర్వము రైతు సంసారమునకై వుపయోగించు వస్తువులను వ్యవసాయపు పశువులను రివిన్యూ బాకీలకై జప్తుచేయు చుండలేదు. తిండికి లేనివారును, దిక్కులేనివారును, యీ దేశమునందు యీ బ్రిటిషు పరిపాలనలో పెరిగి పోయిరి. జీవనము జరుగక పొట్టకూటికై రైతులు కూలిపనికి దేశమునందు దిమ్మరుచున్నారు. ఏదో కొంత కూలి దొరికినచో తృప్తి

పడుచున్నారు. బ్రిటిషు పరిపాలనమే రైతులను 'పాపరు'లుగా చేసినదని నొక్కి చెప్పవలయును,". బెంగాలు సివిల్ వుద్యోగి యగు సర్ ఫ్రెడరిక్ జాన్ షోర్ (Sir Fredric John Shore) గారు 1837 సంవత్సరమునాటి భారతీయుల స్థితిని గురించి యిట్లు వ్రాయుచున్నారు. "హిందూదేశపు ప్రజల సంతోషపు రోజులు నశించినవి. ఈదేశమునుండి ధనము ఎడతెగక గొంపోబడు చున్నది. కొందరి మేలుకొఱకే ఏర్పడిన యీ ప్రభుత్వమునకై భారతదేశపు ప్రజలు చాల హింసింపబడుచున్నారు. ఇంగ్లీషు సర్కారువారు, భారతదేశచరిత్రయం దెప్పుడును ఏసర్కారు చేతను వేయబడనంత, వసూలు చేయబడనంత, పన్నులువేసి, ద్రవ్యము వసూలు చేయుచున్నారు. అందువల్ల భారతీయులు "పాపర్" అగుచున్నారు." లార్డు కారన్‌వాలీస్ గారు 1790 సం॥లో ల్యాండు సెటల్‌మెంటు విషయమున వ్రాసిన "మినిట్" నం దిట్లు వ్రాయుచున్నారు. "గుత్తల రూపముగాను ఇంగ్లీషు వారు తమవారికి రహస్యముగా పంపుచుండు ద్రవ్య ప్రవాహము వల్లను భారతదేశపు వ్యాపారము వ్యవసాయమున్ను నశించినవి. సర్ జాన్ షోర్ గారు 1787 వ సం॥ న యిట్లు వ్రాసియున్నారు. "ఈస్టు ఇండియా కంపెనీవారు భారతదేశమునకు వర్తకులుగను చక్రవర్తులుగను ఉన్నారు. వర్తకపు హోదాలో భారతదేశ వ్యాపారము వశపఱచుకొని ద్రవ్యము సంపాదించుటకు భారతీయ వ్యాపారసౌష్ఠవమును నశింపజేసిరి. చక్రవర్తుల హోదాలో గుత్తలు వసూలు చేయుచున్నారు. యూరపుదేశమునకు పంపబడు

డబ్బుకు బదులుగా సరకులను వసూలుచేసి పంపుచున్నారు. ఇట్లు పంపుటవల్ల భారతీయ సరకులకు విలువ హెచ్చినదని ఊహించినను అందువలన కలుగుచుండు నష్ట మపారము. పరప్రభుత్వమువల్ల యీనష్టము మరింత యెక్కువ." 1835 వ సంవత్సరమున మాంటాగ్‌మరీమార్టిన్ (Mantagomary Martin) గారు బెంగాల్ బీహారులో 1807–1814 వరకు గావింపబడిన సర్వేవిషయమున యిట్లు వ్రాయుచున్నారు. "ఈ సర్వేవలన భారతదేశపు ఐశ్వర్యమున్ను భారతీయుల బీదరికమున్ను తెలసి కొనబడినది. బ్రిటిషిండియానుండి యేటేట గొంపోబడు 3,000,000 పౌనులు 30 సంవత్సరములలో 12% కాంపౌండు వడ్డితో 723,900,00 స్టెర్లింగులకు పెరిగినది. ఇట్టి ద్రవ్యపు దోపిడి యింగ్లాండులో జరిగియుండిన యెడల ఇంగ్లాండెప్పుడో "పాపర్" కావలసినదే. దినమునకు 2 లేక 3 పెన్నీల కూలీ సంపాదించు భారతీయులు యీదోపిడివల్ల ఎంతనష్టపడి యుండ వచ్చును ?" మిల్సుగారి భారతదేశ చరిత్రలో నిట్లున్నది. "భారతదేశము నుండి హరింపబడు ద్రవ్యముద్వారా భారతీయ పరిశ్రమల రక్తము పీల్చినట్టయినది. శక్తిలేని భారతీయ పరిశ్ర మలకు సహాయము దొరకకపోయినది."

# భారతదేశపు చేతిపరిశ్రమల నాశము

బ్రిటను దేశమందు యంత్రపరిశ్రమలు అభివృద్ధి కావడముతోడనే అందు కనుకూలముగా భారతదేశపు పరిశ్రమలు నశింపచేయబడినవి. అందులో భారతదేశపు చేతిపరిశ్రమలు పూర్తిగా చంపబడినవి. భారతదేశమందలి మార్కెట్లు బ్రిటను దేశపు యంత్రములవల్ల తయారుకాబడిన సరకులను విక్రయించు విక్రయశాలలుగా మార్చబడినవి. భారతదేశపు వ్యవసాయము బ్రిటను దేశపు యంత్రములకు కావలసిన ముడిపదార్థములను పండించు వృత్తిగా మార్చబడినది. ఇందు కనుకూలముగా భారతదేశపు చలామణి పద్ధతి, వ్యాపార శుల్కములు విధించు పద్ధతి, పరపతి యీవిషయములందు చట్టములు గావింపబడినవి.

పందొమ్మిదవ శతాబ్దపు మధ్యకాలమువఱకును భారత దేశమున బ్రిటిషువారి వ్యాపార చట్టముల తత్వము భారతదేశపు యెగుమతులను తగ్గించి తమ దేశపు దిగుమతులచే యీదేశమును నింపుటేగాని వేరుగాదు. ఆటంకములేని వ్యాపార సిద్ధాంతము భారతదేశమున అమలుజరుపబడినదిగాని బ్రిటను మాత్రము తనవ్యాపారమును తన రక్షణలో నుంచుకొన్నది. బ్రిటనునుండి హిందూదేశమునకు దిగుమతి చేయబడు బ్రిటిషు సరకులపైన 3½% డ్యూటీ వేయబడుచుండగా, బ్రిటను దేశము నకు దిగుమతికాబడు భారతదేశపు గుడ్డపైన 10% డ్యూటీ వేయ

బడినది. హిందూదేశపు శిల్కు-బట్టలపైన 20% డ్యూటీ వేయబడినది. బ్రిటను దేశమునుండి హిందూదేశమునకు దిగుమతి చేయబడు శిల్కు-బట్టలమీద 2% మాత్రమే డ్యూటీ వేయబడుచుండగా బ్రిటను దేశమునకు దిగుమతి కాబడు ఇండియా శిల్కు-బట్టల మీద 30% డ్యూటీ వేయబడుచుండినది. హిందూదేశమునుండి బ్రిటనుకు దిగుమతి కాబడుచుండిన ముడి యినుముపై టన్నుకు 5 షిల్లింగులు రక్షణసుంకము వేయబడినదిగాని హిందూదేశమునకు బ్రిటనునుండి దిగుమతి కాబడు ముడి ఇనుముపైన యేవిధమైన సుంకముగాని వేయబడలేదు. హిందూదేశపు చక్కెరపైన యింగ్లండులో సుంకము వేయబడినది. ఇండియాద్దేశపు రమ్ (Rum) మీద 1 గ్యాలనుకు 15 షిల్లింగులు సుంకము వేయబడినది. దిగుమతి కాబడు హిందూదేశపు అచ్చువేసిన పుస్తకములపైన ఒక క్వార్టరుకు ఇంగ్లండులో రెండు పౌనులు పదిషిల్లింగులు సుంకము వేయబడినది.

అనేకరకములైన ఈసుంకములవల్ల భారతదేశపు ఎగుమతులు నశించి బ్రిటను దేశపు దిగుమతులు హెచ్చినవి. భారతదేశమునుండి బ్రిటనుదేశమునకు దిగుమతి కాబడుచుండిన గుడ్డ యీక్రిందివిధమున తగ్గినది.

| సంవత్సరము | పీసెస్. |
| --- | --- |
| 1814 | 1266608 |
| 1821 | 534495 |
| 1828 | 422504 |
| 1835 | 306086 |

ఈ సంవత్సరములయందే బ్రిటనుదేశమునుండి భారతదేశమునకు దిగుమతి కాబడుచుండిన గుడ్డ పెరిగినది:—

| సంవత్సరము. | గజములు. |
|---|---|
| 1814 | 818208 |
| 1821 | 19138726 |
| 1828 | 42822077 |
| 1835 | 51777277 |

1815 సం॥ న భారతదేశము నుండి బ్రిటనుదేశమునకు ఎగుమతి కాబడుచుండినగుడ్డ ఖరీదు 13,00,000 పౌన్లనుండి 1832 సంవత్సరమునకు 100,000 పౌనులకు తగ్గినది. ఇంగ్లాండు నుండి ఇండియాకు దిగుమతి కాబడుచుండిన గుడ్డఖరీదు 1815 సంవత్సరములో 26300 పౌనులనుండి 1832 సంవత్సరమునకు 400,000 పౌనులకు పెరిగినది.

భారతదేశమునుండి ఎగుమతి కాబడుచుండిన శిల్కుబట్టలున్ను, ముడి సిల్కున్ను తగ్గిపోయినది. 1828–1829 సంవత్సరములో 920,000 పౌనులుండినది 1831–32 సంవత్సరమునకు 540,000 పౌనులకు తగ్గినది. మరియు యీ శిల్కు ఎగుమతి రానురాను తగ్గి యిప్పటికికూడా వృద్ధికాలేక పోయినది.

బ్రిటిషువారి వ్యాపార సిద్ధాంతముల అవకతవకలవల్ల హిందూదేశపు వాణిజ్యము నశించినది. 1828 సం॥ నుండి 1838 సం॥ వరకు సరాసరి సంవత్సరమునకు ఇంగ్లాం

డుకు పోవుచున్న ఎగుమతి ఖరీదు 28000 పౌనులు. కాని యిదే సంవత్సరములలో ఇండియాకు ఇంగ్లాండు దిగుమతి చేయుచుండిన గుడ్డఖరీదు 300,000 పౌనులనుండి 800,000 పౌనులకు పెరిగినది. అదియు 1857 సం॥ నకు తరువాత కొన్ని సంవత్సరములవరకే.

భారతదేశపు చక్కెర యెగుమతి రానురాను తగ్గి తొమ్మి దవ శతాబ్దాంతమునకు పూర్తిగా నశించినది.

ఇదేవిధమున భారతదేశమున చేతితో తయారగు వస్తువులు, పోత యినుము, గ్లాసువస్తువులు, కాగితములు ఈ పరిశ్రమలు యంత్రముల పోటీకి తాళలేక నశించిపోయినవి.

ప్రపంచమునే ఆశ్చర్యమొందించిన ఇండియా నావి కాపరిశ్రమ ఈష్టిండియాకంపెనీ డైరెక్టరుల నిరంకుశ శాసనముల వల్ల నశింపజేయబడినది. 1795–1796 సం॥లో కలకత్తాలో 4105 టన్నుల టనేజిగల నావలు నిర్మింపబడినవి. 500 లేక 600 టన్నుల టనేజుగల అయిదు నావలు నిర్మింపబడినవి. అయితే 1840 సం॥నకు యీపరిశ్రమ పూర్తిగానశించిపోయినది.

1850 సంవత్సరమునకు భారతీయ చేతి పరిశ్రమలు పూర్తిగా నశించినవి. తదుపరి భారతదేశమున వేయబడిన రైలుమార్గములద్వారా మనదేశమున మూలమూలకు బ్రిటిషు యంత్రములచే తయారైన వస్తువుల వెదజల్లి హిందూదేశపు మార్కెట్లను బ్రిటిషువారు పూర్తిగా వశపఱచుకొనిరి.

# భారత దేశపు వ్యాపారాభివృద్ధి బ్రిటిషు వ్యాపారమునకే

భారతదేశపు గృహపరిశ్రమలు నశింపజేయబడుటచే నట్టిపరిశ్రమలవల్ల జీవించువారందఱు వ్యవసాయముమీద ఆధార పడవలసిన పరిస్థితు లేర్పడినవి. అప్పటికే దేశమందలి వ్యవసాయదారుల ఆర్థికస్థితి చాల చెడిపోయియుండినది. సర్కారుకు రైతు యిచ్చుకోవలసిన గుత్త లప్పటికే మితిమీరి యుండినవి. అందుచే వ్యవసాయమువల్ల జీవించువారి సంఖ్య పెరిగినకొలది వారి యార్థికస్థితి మరింత యధ్వాన్నమైనది. సర్కారువారు భారతజాతి కంతటికిని వ్యవసాయమే ముఖ్యజీవనముగాచేసి అట్టి వ్యవసాయమువల్ల తమ పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థములు పండింపజేసి తమయొక్క చిరకాలపు కోరికను నెరవేర్చుకొనిరి. భారతీయ పరిశ్రమలవల్ల తయారైన వస్తువుల ఎగుమతు లొక వంక పడిపోవుచుండ యంత్రవ్యవసాయపు వస్తువుల ఎగుమతులు మితిమీరి పెరిగినవి. 1849 వ సంవత్సరమున భారతదేశము నుండి ఎగుమతి కాబడుచుండిన ముడిప్రత్తి విలువ 1,775,309 పౌనులనుండి 1858 వ సంవత్సరమునకు 4,301,768 పౌనులకు పెరిగినది. 1901 వ సంవత్సరమునకు 10,129,647 పౌనులైనది. 1849 సంవత్సరములో జనుపనార ఎగుమతి 68717 పౌన్ల నుండి 1858వ సంవత్సరమునకు 303,292 పౌనులకున్ను 1901వ

సంవత్సరమున 10,86,756 పౌనులకును పెరిగిపోయినది. గింజల ఎగుమతి 1849 సం॥లో 858,691 నుండి 1858 సంవత్సరమున 3,790,374 పౌనులై 1901 వ సంవత్సరమునకు 14,069,509 పౌనులకు పెరిగినది. ముడితోళ్ళు, నూనెగింజలు, టీ, మరియనేకరకపు వ్యవసాయపు పదార్థముల ఎగుమతులు పెరిగిపోయినవి. అందువల్ల భారతీయులకు వలయు తిండిపదార్థములు గొంపోబడినందున దేశమందు తిండికిలేనివారి సంఖ్య పెరిగిపోయినది. ఇందుకు తోడుగా దేశమందు కరవులువచ్చి వేలకువేలు, లక్షకులక్ష ప్రజలు కూడులేక మాడి చచ్చిరి. బ్రిటిషు పరిపాలనలో భారతదేశమున 22 కరవులు వచ్చినవి.

భారతజాతి వ్యవసాయమునకు వ్యాపారసూత్రమునే ముఖ్యముగా గమనించుటవల్ల డబ్బు సంపాదించు పంటలగు ప్రత్తి, నూనెగింజలు, జనుము మొదలైనవి పెరిగి రైతుకు తిండికి కావలసిన పదార్థములు పండకపోయినవి. పండిన కొద్ది పదార్థములుకూడా నవీన ప్రయాణసౌకర్యములవల్ల యీ దేశము నుండి ఎగుమతి కాబడినవి. ఇందుమూలాన రైతుల ఆర్థికస్థితి చెడినది. పరదేశపు వ్యాపారములకై భారతదేశపు పల్లెలలో మధ్యరకపు ప్రజలు బయలుదేరినారు. చిన్నవ్యాపారులు, పెద్ద వర్తకులు, దళాలీదార్లు మొదలైనవారెందరో బయలుదేరి అమాయకుడైన రైతును దోచుటకు ప్రారంభించిరి. వ్యవసాయదారుకు అప్పులిచ్చి వారిని తమచేతిలో నుంచుకొనిరి. రైతు తాను పండించినపంటను వీరికి చాల తక్కువధరకు అమ్మవలసివచ్చినది. అందువల్ల యీ మధ్యరకపు ప్రజలు కుబేరులై తమక్రిందనుండు సామాన్యరైతు రక్తము పీల్చుటచే చేవలేక ఆర్థికసౌష్ఠవముచెడి రైతు జీవచ్ఛవమైపోయినాడు.

# భారతీయ పరిశ్రమాభివృద్ధి నశించుట

భారతదేశ పరిపాలన ఈష్టుఇండియా కంపెనీవారి చేతులనుండి చక్రవర్తిచేతికి వచ్చినను ప్రయోజన మేమాత్రము గలుగలేదు. దినములు గడచినకొలదియు బ్రిటిషువారి నిరంకుశత్వము మరింత హెచ్చినది. బ్రిటిషువారి పెట్టుబడిధనము భారతదేశమున పెచ్చుపెరిగి బ్రిటనుయొక్క పరిశ్రమాభివృద్ధికిని బ్రిటిషు ఆర్థికాభివృద్ధికిని అనుకూలపడునట్లు భారతజాతీయ జీవితము నశింపజేయబడినది. వర్తకశుల్కములు విధించుటలోను, చలామణీపద్ధతులలోను, రైల్వేపరిపాలనలోను, పన్నులు విధించుటలోను, సర్కారు ఖర్చులలోను, జాతీయ ఋణములోను బ్రిటిషువారు తమ ఆర్థికాభివృద్ధికై కావలసిన మార్పులు దెచ్చిరి. ప్రపంచమునం దెచ్చటను యేగవర్నమెంటుకును కానంత ఖర్చు భారతప్రభుత్వమునకగుచున్నది. భారతదేశపు ఆర్థికాభివృద్ధి నానాటికి సన్నగిల్లిపోవుచున్నది.

భారతదేశములోని చేతిపరిశ్రమలు నశింపజేయబడిన తరువాత యంత్రపరిశ్రమలు నశించిపోవుటకు బ్రిటిషువారు సర్వవిధముల ప్రయత్నించిరి. 1857 సం॥వరకు భారతదేశపు వ్యాపారసిద్ధాంతము స్వేచ్ఛావ్యాపారమై యుండెడిది. ముడివస్తువులమీద 3½% న్ను తయారైన సరకులమీద 5% న్ను దిగుమతి

సుంకములు వేయబడుచుండినవి. 1857 వ సంవత్సరమున సంభవించిన సిపాయీల తిరుగుబాటువల్ల కలిగిన నష్టమును భర్తీ చేయుటకుగాను ఈ దిగుమతిసుంకములు 10% యెక్కువైనవి. అయితే తరువాత 1864 సం॥న యీ సుంకములు 7½% కున్ను, 1865 సం॥ 5% కున్ను తగ్గింపబడినవి. 1882 వ సంవత్సరమున ఇండియా సర్కారువారు మేన్‌చెస్టర్ వర్తకుల యొత్తిడివల్ల యీ దిగుమతి సుంకములు తీసివేసిరి. 1894 సం॥వరకు మరల నీ సుంకములు విధింపబడలేదు. తరువాతమాత్రి మీదిగుమతి సుంకములు 5% వేయబడినవి. ఇందుకై మేన్‌చెస్టర్ వర్తకుల యాందోళనవల్ల ఇండియా మిల్లులలో తయారగు 20 నంబరు నూలున్ను, దానికి మించిన నంబరు నూలుపైనను 5% గుత్త వేయబడినది. ఇది ఇంగ్లీషు వర్తకులను తృప్తిపరచలేదు కాబట్టి భారతదేశమునకు దిగుమతికాబడు ఇంగ్లీషు గుడ్డమీద 1896 సం॥నందు 3½% కు తగ్గింపబడినది. ఇందుకు తోడుగా హిందూదేశపు మిల్లుబట్టపైన సుంకము వేయబడినది. దాదాపు ప్రపంచయుద్ధ ప్రారంభమువఱకు నీదిగుమతి సుంకముల తగ్గింపు అట్లనేవుండినది. ఇండియాసర్కారువారు వేసిన యీ వ్యాపార సుంకములు బ్రిటిషువారి రక్షణకేగాని భారతీయుల మిల్లురక్షణకు కాదు. భారతీయ మిల్లుపరిశ్రిమలవారు వలదన్నను వినక వేయబడిన 3½% సుంకమువల్ల బాల్యదశయందుండిన భారతదేశపు వస్త్రపు మిల్లులకు చాలనష్టము కలిగినది. ఈ సుంకము 1926 సం॥ వరకు తీసివేయబడలేదు.

సర్కారువారి వ్యాపారచట్టములవల్ల భారతీయ పరిశ్రి మాభివృద్ధికి తీరని యాటంకము కల్పింపబడినది. భారతీయ పరిశ్రమలు పుట్టినచోటనే చంపబడినవి. బీహారు, ఒరిస్సా, బెంగాలు రాష్ట్రములందలి బొగ్గుపరిశ్రమలున్ను, బెంగాలులోని జనుప పరిశ్రమయున్ను, పడమటి యిండియాలోని ప్రత్తి పరిశ్రమ యున్ను తప్ప భారతదేశమున మరేపరిశ్రమయును ప్రపంచయుద్ధ ప్రారంభమువరకు తలయెత్తలేదు. ప్రపంచయుద్ధము ప్రారంభ మగుటవల్ల బ్రిటనుయొక్క పరిశ్రమలన్నియును యుద్ధ సామగ్రిని మారణసాధనములను తయారుచేయుటలో చిక్కియుం డుటవలన భారతీయ పరిశ్రమలకు బ్రిటిషు పరిశ్రమల పోటీ కొంతతగ్గినది. అభివృద్ధికి కొంతయవకాశ మేర్పడినది. ఈ అవకాశము తనంతవచ్చినదిగాని బ్రిటిషువారి అభిమానమువల్ల గాదు. ఈ యుద్ధపురోజులలో బ్రిటను భారతీయ పరిశ్రమలపట్ల మూకీభావము వహించినది. అందువల్ల భారతపరిశ్రమలకు కలుగవలసినంత యభివృద్ధి కలుగలేదు. భారతదేశపు మార్కెట్ల యందు బ్రిటిషువారిపోటీ కొంతతగ్గుటచే జపాను, అమెరికా దేశములు మెల్లమెల్లగా ఈ మార్కెట్లను వశపఱచుకొన్నవి. ఈరెండు దేశములతో పోటీతగిలి భారతీయపరిశ్రమలు అభివృద్ధి చెందినవి. 1876 సం॥న భారతీయ నూదియంత్రాగారములందు 9139 మగ్గములు పనిచేయుచుండినవి. 1913 సం॥నకు అవి 94,136 కు పెరిగినవి. మరియు 1932 సం॥నకు 186,407 మగ్గములైనవి. ఈ నూదియంత్రములు ఈదేశమున 1913 లో

172 వుండి 1932 సం॥ నాటికి 340 అయినవి. ఈ మిల్లులలో తయారైనగుడ్డ 1899 సం॥లో 102 మిలియను పౌనులై యుండి 1914 సం॥ నకు 274 మిలియనుల పౌనులై 1931 సం॥నకు 590 మిలియనుల పౌనులైనది. జనుపనార పరిశ్రమలందు 1879—80 వరకు 4946 మగ్గములున్ను 70840 కదురులున్ను ఆడినవి. 1913-14 సంవత్సరములలో 36,050 మగ్గములున్ను 744,289 కదురులున్ను ఆడినవి. అయితే 1930 సం॥లో 61,834 మగ్గములున్ను, 1224982 కదురులున్ను అయినవి. జనుపనార మిల్లులు 1879-80 సంవత్సరములో 22 నుండి 1913-14 సంవత్సరములో 64 అయి 1930-31 సంవత్సరమునకు నూటికి పెరిగినవి. హిందూదేశములో 1914 సం॥మున 240,000 టన్నుల ముడియినుమున్ను ( Pig iron) 70,000 టన్నుల ఉక్కున్ను (Steel) వుత్పత్తి చేయబడినవి. 1930 సంవత్సరములో 1140000 టన్నుల ముడియినుమున్ను 616000 టన్నుల ఉక్కున్ను వుత్పత్తిచేయబడినవి. భారత దేశమునుండి 1920-21 సంవత్సరమువరకు ప్రతిసంవత్సరము 122000 టన్నుల లోహములకంటె ఎక్కువ ఎగుమతిచేయబడి యుండలేదు. కాని 1929_30 సంవత్సరములో యీలోహపు యెగుమతి 871000 టన్నులైనది. భారతదేశమున నుత్పత్తి కాబడు బొగ్గు 1913 సంవత్సరమునందు 16.2 మిలియనుటన్నుల నుండి 1914 సంవత్సరమునందు 22.6 మిలియను టన్నులై 1919 సంవత్సరమునకు 23 మిలియను టన్నులైనది. భారతదేశపు

తేయాకుపంటయు, దీని ఎగుమతియు కూడా హెచ్చినది. 1896-97 సంవత్సరములో సముద్రముమీదుగా ఎగుమతికాబడిన తేయాకు 150 మిలియను పౌనులు. 1912-13 సంవత్సరములో ఈ ఎగుమతి 282 మిలియను పౌనులై 1931-32 సంవత్సరములో 341 మిలియను పౌనులైనది. ప్రపంచయుద్ధమువల్ల భారతీయ తోళ్ళపరిశ్రమ అభివృద్ధి కాజొచ్చినది. 1913 సంవత్సరములో 1,75 కోటిరూపాయల వెలగల 194,763 క్వార్టరుల పదునుచేయబడిన తోళ్ళు ఎగుమతిచేయబడినవి. 1917-18 సంవత్సరమునందు 4.8 కోట్లరూపాయలవెలగల 3,61674 క్వార్టరుల పదునుకాబడిన తోళ్ళు ఎగుమతి కాబడినవి. ఈపరిశ్రమలేకాక చిన్నచిన్నవగు రసాయనపదార్థములు, గాజు, కాగితములు, నూనె, సబ్బు మొదలైన పరిశ్రమలు వృద్ధికాబడినవి. ఈపై అభివృద్ధి చాలదినములుండలేదు. బ్రిటిషు పరిశ్రమల పోటీవల్లను, ప్రపంచఆర్థికసౌష్ఠవము నశించిపోవుటవల్లనుమెల్ల మెల్లగా అభివృద్ధియగుచుండిన భారతదేశపు పరిశ్రమలు మరల సన్నగిల్లినవి. 1920 సంవత్సరమునకే నశింపు చిహ్నములు కనబడినవి. భారతదేశమునందలి యెన్నియో కర్మాగారములు, కంపెనీలు మూసివేయబడినవి. ప్రపంచయుద్ధమునకు తరువాత రూపాయవిలువ హెచ్చింపబడుటచే ప్రపంచమునందలి అన్నిదేశములవారును భారతదేశపు మార్కెట్లయందు పోటీచేయ ప్రారంభించిరి. ఈ పోటీని యెదుర్కొనుటకై భారతదేశపు పరిశ్రమలకు రక్షణ తప్పనిసరియైనది. ఇట్టి రక్షణకై భారత పరిశ్రమలు ఆందోళనచేసినవి. ప్రపంచయుద్ధమువల్ల భారతదేశ

మందలి ఖజానాలు ఖాళీలయినవి. దీనిని భర్తీచేసుకొనుటకై భారతదేశపు ఎగుమతులపైనను, దిగుమతులపైనను సర్కారువారు సుంకములువేసిరి. యుద్ధపుదినములలోనే సుంకములు ఎక్కువచేయబడినవి. భారతదేశమునం దప్పుడేర్పడిన పరిస్థితులవల్ల సర్కారువారు మొట్టమొదట భారతదేశపు పరిశ్రమల కొకవిధమగు రక్షణయొసగిరి. మొట్టమొదట ఈ రక్షణశాసనములవల్ల ద్రవ్యము సంపాదించు నుద్దేశమేగాని వేరుగాదు. నూలు, గుడ్డ, అగ్గిపెట్టెలు, చక్కెర, వాసనద్రవ్యములు, సిగరెట్లు, ఈ పరిశ్రమల విషయమై యిదివరకే వేయబడిన సుంకములు కొంచమెక్కువచేయబడినవి. భారతదేశపు పరిశ్రమల రక్షణలకు సలహానిచ్చుటకు సర్కారువా రొక శుల్కసంఘము (Tariff Board) ను యేర్పరచిరి. వీరిసలహామేరకు భారతదేశపు ఉక్కుపరిశ్రమకు 1924 సంవత్సరపు ఉక్కురక్షణ చట్టము (Steel protection Act of 1924) ద్వారా రక్షణయొసగబడినది. 1925 సంవత్సరమున ప్రత్తిపైన సుంకము తీసివేసినను మరల 1930-31 సంవత్సరములో యీసుంకము 11% నుండి 15% కు హెచ్చింపబడినది. ఈ హెచ్చింపేకాక బ్రిటిషు వస్తువులపైన 5% రక్షణ సుంకము విధింపబడినది. 1931—32 సంవత్సరములో భారతదేశపు దిగుమతులపైన 5% సుంకము విధింపబడినది. 1931 సంవత్సరపు సప్లిమెంటరీ బడ్జెట్టుకుగాను భారతదేశపు అన్నివిధములగు దిగుమతులపైనను 25% సుంకము సర్‌చార్జి చేయబడినది. జపాను దేశపు నాణ్యమగు ఎన్ (Yen) విలువ

పడిపోవుటవల్ల భారతదేశమునకు జపాను దిగుమతులు హెచ్చినవి. అందువల్ల జపాను సరుకులపైన 1932 సంవత్సరములో 50% సుంకము ఎక్కువచేయబడినది. 1933 సంవత్సరమున కీసుంకము 75% అయినది. చక్కెర, అగ్గిపెట్టెలు ఈపరిశ్రమలకు కొంత రక్షణ దొరకినది.

అటావా యొడంబడికవల్ల భారతదేశ మందలి రక్షణా పద్ధతి పోయి బ్రిటిషు సామ్రాజ్య వస్తువులకు ప్రత్యేకత యేర్పడినది. ఈయొడంబడికద్వారా హిందూదేశము బ్రిటిషు వస్తువులకు 10% ప్రత్యేకత చూపవలసివచ్చినది. ఇందుకు బదులుగా ఇండియాదేశపు టీ, జనుపనార, బియ్యము, వీటిపైన సుంకములు తీసివేయబడినవి. ఈ అటావా యొడంబడికకు తోడుగా ఇండియాకున్ను బ్రిటనుకున్ను మరియొక వర్తకపు యొడంబడిక జరిగినది. దీనిని 'మోడీ లీస్ ప్యాక్టు' అందురు. (Mody Lee's Pact). ఈయొడంబడిక మూలమున ఇండియాదేశము బ్రిటిషు గుడ్డలకు (Cotton piece goods) చాల వరకు ప్రాముఖ్యము (Preference) నొసగవలయునని నిర్ధరింపబడినది. మరియు నిదివరకు బ్రిటిషు శిల్కుబట్టలపై నుండిన సుంకము చాల తక్కువ చేయబడినది. ఇందుకుబదులుగా బ్రిటిషు సామ్రాజ్యపు మార్కెట్లయందు బ్రిటిషు సామ్రాజ్యపు సరకుల కెట్టిఅనుకూలము లుండెడివో అట్టివి భారతదేశపు సరకులకు బ్రిటిషు సామ్రాజ్యపు మార్కెట్లయం దొసగబడినవి. వర్తక విషయమై జపాను దేశమునకున్ను ఇండియా దేశమునకున్ను ఒక యొడం

బడిక జరిగినది. ఈ యొడంబడిక ననుసరించి జపాను సరకుల పైన ఇండియా దేశములో 50% కంటె యెక్కువ సుంకము వేయకూడదని నిర్ధరింపబడినది. ఇండియాదేశము జపానునుండి సంవత్సరమునకు 325 మిలియన్ గజముల నూలు దిగుమతి చేయవలసినదిగాను, జపానుదేశము ఇండియా నుండి సంవత్సరమునకు ఒక్కమిలియను బేళ్ళ ముడిప్రత్తి కొనవలసినదనియు నిర్ధరింపబడినది. 1934 సంవత్సరపు కాటన్ టెక్స్టైల్ యాక్టు (Cotton Textile Act) లో ఇండియా జపాను ఒడంబడికయొక్కయు మోడీ లీస్ ప్యాక్టుయొక్కయు షరతులు వివరింపబడినవి.

ప్రపంచ యుద్ధమునకు తరువాత బ్రిటిషువారి వ్యాపార తత్వమంతయు భారతీయ పరిశ్రమలకు కొంతమట్టుకు రక్షణ యొసగుటలోను భారతదేశపు మార్కెట్లలో బ్రిటిషు సామ్రాజ్య వస్తువులకు ప్రాముఖ్యత నొసంగుటలోను సరిపోయినది. అటావా యొడంబడికవల్ల బ్రిటిషు వస్తువుల కేర్పడిన ప్రత్యేకతకై భారతీయులు చాలమంది అసంతృప్తిపడి, తమ నిరసనభావమును వెల్లడించిరి. భారతదేశము బ్రిటిషు సామ్రాజ్య వస్తువుల కిచ్చిన ప్రత్యేకతవల్ల బ్రిటను చాల లాభము పొందినది. బ్రిటను ఇండియా సరకులకు తన సామ్రాజ్యమున నొసగిన సౌకర్యములచే, ఇండియా దేశపు వ్యాపార మభివృద్ధికాలేదు. హిందూదేశపు తేయాకునకు యిదివరకే బ్రిటిషువారి స్వలాభములకై ప్రత్యేకత యేర్పడి యుండినది. అందువల్ల అటావా యొడం

బడికవల్ల ఇండియాదేశపు తేయాకునకు యెక్కువ ప్రత్యేకత లేకపోయినది. ఈ బ్రిటిను సామ్రాజ్యవస్తు ప్రత్యేకతవల్ల భారత దేశముయొక్క యితరదేశపు వ్యాపారము నశించినది. భారత దేశమునుండి యితర దేశములకు పంపబడుచుండిన ఎగుమతులు తగ్గినవి. 1933 సంవత్సరమునందు భారతదేశపు పట్టు ఎగుమతుల విలువ 146.3 కోట్ల రూపాయలు. ఇందులో 46.6 కోట్ల రూపాయలు బ్రిటిషుదేశము (United kingdom) కొన్నది. తక్కిన 78.7 కోట్ల రూపాయలు బ్రిటిషు సామ్రాజ్యములో చేరిన దేశములు కొన్నవి. ఇప్పటి వ్యాపారపు లెక్కలుబట్టి హిందూదేశము బ్రిటిషు సామ్రాజ్యములోనికి పంపు ఎగుమతులు తగ్గి సామ్రాజ్యపు దిగుమతులు హెచ్చినవి. బ్రిటిషు సామ్రాజ్య వస్తు ప్రత్యేకతవల్ల భారతదేశపు ఎగుమతులు యెక్కువ కాలేదు. బ్రిటిషు సామ్రాజ్యములో చేరని దేశములలో భారతదేశపు సరకులకు ప్రత్యేకత లేనందువల్ల యిట్టి రాజ్యములకు ఎగుమతులు తగ్గినవి. హిందూదేశపు ఎగుమతులలో ప్రత్తి, జనుము, తేయాకు, తిండిపదార్థములు ముఖ్యమునైనవి. ఈ వస్తువులకు సామ్రాజ్య ప్రత్యేకతవల్ల సాహాయ్యము లేకపోయినది. భారత దేశమునుండి జపానుకొన్నంత ప్రత్తి బ్రిటిషు సామ్రాజ్య మెప్పటికిని కొనజాలదు. ఇప్పుడిప్పుడు జపానువస్తువులమీద విశేషముగా సుంకములు విధింపబడుటచే ఇండియాదేశపు ప్రత్తికి బదులుగా అమెరికాదేశపు ప్రత్తిని జపాను కొనుచున్నది. ఇట్టి పరిస్థితులు కొంతకాలము జరిగినయడల భారతదేశములోని

ప్రత్తిపంట నశించిపోవును. ఇండియా ప్రత్తిని జపాను కొననపుడు బ్రిటిషు సామ్రాజ్య మీ ప్రత్తిని కొనుటకు సిద్ధ పడవలెను. లేనియెడల ప్రత్తివ్యాపార మీదేశమున పూర్తిగా నశించును. ఇంతవరకు ఇండియానుండి ఇతరదేశములు కొను చుండిన గోధుమలు, తిండిధాన్యములు బ్రిటిషు సామ్రాజ్యమునకు కొబట్టవు. కొటట్టి యిట్టి పదార్థముల ఎగుమతులుకూడా తగ్గి పోవును.

ఈ విషయమై బ్రిజినారాయణగా రిట్లు చెప్పుచున్నారు: "ఈ సామ్రాజ్య వస్తు ప్రత్యేకత అమలు జరుపుట కిది సమ యము కాదు. ప్రపంచమున యితరదేశములు వాని వానికి కావలసినపదార్థము లవియే తయారుచేసుకొనుచున్నవి. తమ కోరికలకై యితరదేశములమీద నాధారపడుట తగ్గినది. భారత దేశము పూర్వమువలె నిప్పుడు ఎగుమతి చేయజాలదు. శాస్త్ర పరిశోధనలవల్లను, ఆర్థికాభివృద్ధివల్లను యితరదేశము లేవియు భారతదేశపు వస్తువుల నంతగా కొనవు. కడచిన 30 సంవత్సర ముల కంటె యీదినము మాస్థితి చాలతగ్గినది. భారతదేశము ఇతరదేశ వ్యాపారముపట్ల జూపు తీవ్రదృష్టిని, కలుగజేయు అన్యాయమును, సహించక మరల బదులుగా ఇతర దేశములు భారతదేశ వ్యాపారమునకు అన్యాయము కలుగచేయును."

ఈ సామ్రాజ్య వస్తు ప్రత్యేకతవల్ల భారతదేశపు ఎగుమతు లెట్లు తగ్గినవో చూడుడు. ఎగుమతులు దిగుమతులు

కూడా తగ్గినను అందులో మెగుమతులు ఎక్కువగా తగ్గినవి. 1924–25 సంవత్సరములో భారతదేశపు ఎగుమతులు 66% తగ్గినవి. 1932–33 సంవత్సరములో దిగుమతులు 46% తగ్గినవి. 1933–34 సంవత్సరమున ఎగుమతులు 62% తగ్గినవి, దిగుమతులు 53% తగ్గినవి. 1934–35 సంవత్సరములో కడచిన సంవత్సరముకంటె ఎగుమతులు 5 కోట్లు ఎక్కువైనను దిగుమతులు 17 కోట్లకు పెరిగినవి. బ్రిటిషుసామ్రాజ్య వస్తు ప్రత్యేకతవల్ల భారతదేశములో నింతవరకు తక్కువ ధరకు దొరకు వస్తువుల ఖరీదు పెరిగినది.

బ్రిటిషువారి యీ వ్యాపారతత్వమువల్ల భారతీయ పరిశ్రమలు నశించినవి. ఎంతనిరోధము కల్పింపబడినను భారతీయ పరిశ్రమలు కొంతవరకు అభివృద్ధి చెందుచుండుట వాస్తవము.

బ్రిటిషువారి చలామణీ పద్ధతులవల్ల భారతదేశపు పరిశ్రమలు నశించి పోవుచున్నవి. మారకపు పద్ధతులవల్ల బ్రిటిషు పరిశ్రమలున్ను, హిందూదేశమునందుండు బ్రిటిషు సాహుకార్లున్ను అభివృద్ధి చెందుచున్నారు. బ్రిటిషుఖజానాలవల్లను, బ్రిటిషు బ్యాంకుల పలుకుబడిచేతను భారతదేశమునకు బంగారపు చలామణీ పద్ధతి దొరకకపోయినది. మొదటినుండియు భారతదేశపు మారకపు పద్ధతియు చలామణీపద్ధతియు భారతీయ వ్యాపారాభివృద్ధికి గాని, పరిశ్రమాభివృద్ధికిగాని యేమాత్రము తోడుపడలేదు. భారతదేశమునకు బంగారు మారకపురేటు ఆవశ్యకమని కరెన్సీసంఘము

లున్ను, ఇండియా గవర్నమెంటువారున్ను చెప్పినను బ్రిటను అందుకు ఒప్పుకోలేదు. ఇండియాకు బంగారు మారకపురేటు నిచ్చినయెడల ప్రస్తుతము ఇంగ్లాండు నందుండు బంగారము ఇండియాకు తీసుకొనిరావలయును. అది సర్కారు వారికి యిష్టములేదు. ఈ చలామణీపద్ధతు లప్పటప్పటికి మార్పగుటవల్ల భారతదేశము ఆర్థికముగా చెడిపోయినది. అందుకు బదులుగా బ్రిటిషు రాజ్యము ఆర్థికముగా అభివృద్ధి చెందినది. ఈ మారకపు పద్ధతి యంతయు బ్రిటిషు ఉద్యోగుల చేతులందున్నది. అందువల్ల యీ మారకపు సిద్ధాంతమున కొక నిలకడగాని, విధానముగాని లేదు. భారతదేశమునుండి బంగారు దోచుకొని పోవుటకు అనుకూలముగా ఇండియా రూపాయయొక్క మారకపురేటు నిర్ధరింపబడుచున్నది. భారతదేశపు వ్యాపారముగాని, ఆర్థికస్థితిగాని అభివృద్ధి చెందవలెనంటే ప్రస్తుతపు భారతదేశములోని యీ చలామణీపద్ధతి పూర్తిగా మారవలయును.

# భారత దేశములో బ్రిటిషువారి మూలధనము

కడచిన శతాబ్దపు మధ్యకాలమునుండి బ్రిటిషు వారి ధనము భారతదేశములోనికి పెట్టుబడి రూపమున ప్రవహింప జొచ్చినది. ఈపెట్టుబడిధనమువల్ల భారతదేశపు ఆర్థిక పరిణామము బ్రిటిషువారి చేతిలో పడినది. మొదటిలో బ్రిటిషు వారు తమ పెట్టుబడిని ఇండియాదేశపు రైల్వేలయం దుంచిరి. బ్రిటిషువారి ఇనుము, ఉక్కు వ్యాపారాభివృద్ధికై యీపెట్టుబడి ప్రారంభింపబడినది. అందుమూలమున బ్రిటిషు ఇంజనీరింగు కంపెనీలకు చాలలాభములు వచ్చినవి. భారతదేశమునందలి వ్యాపారమంతయు తమ కైవశము చేసుకొనుటకై బ్రిటిషువారు పన్నిన పన్నుగడ యీపెట్టుబడిధనము. ఈష్టుఇండియా కంపెనీ వారు ఈ దేశమునుండి దోచుకొన్న ధనము మరల పెట్టుబడి రూపమున భారతదేశములోనికి వచ్చినది.

రైల్వేలు వేయుటలో లెక్కలేనంత ద్రవ్యము వృథాగా ఖర్చుపెట్టబడినది. ఈ పెట్టుబడి ధనమును రక్షించుటే సర్కారు వారి ముఖ్యకర్తవ్యముగా నేర్పడినది. భారతదేశములో మూల మూలలందును రైల్వేలువేయబడి బ్రిటిషు వ్యాపారమునకు సౌకర్య ములు కలుగజేయబడినవి. అంతకంటె ముఖ్యమైనది ఇండియా సైన్యమును మూలమూలలకు పంపుటకు వలయువసతులు కల్పిం

చుకొనుట. ఈ రైల్వేలు వేయుటవల్ల ఇండియాలోని ఖనిజ సంపదగాని, పరిశ్రమలుగాని అభివృద్ధికాలేదు. రైల్వేలపైన పెట్టుబడిపెట్టిన ధనమునకు వడ్డీ, లాభము, యిచ్చుటకు ఇండియా సర్కారువారు జవాబుదారీపడుటవల్ల రైల్వేలు వేయుటలో దిక్కు తెలియక డబ్బు వెచ్చింపబడినది. 1868 సంవత్సరమునందు వేయబడిన రైల్వేలకు ఒక మైలుకు సరాసరి 18000 పౌనులు వెచ్చింపబడినవి. ఇండియా దేశపు వైస్రాయి కార్యనిర్వాహక వర్గములో ఆర్థికసభ్యుడగు విలియంమెస్సీగా రీవిషయమై పార్లమెంటరీ సంఘము యెదుట నిట్లుచెప్పినారు. "బ్రిటిషు పెట్టుబడిదారుకు అతని పెట్టుబడిధనమునకు ఇండియా గవర్నమెంటు రివిన్యూలో 5% యిచ్చుటచేత తాను పెట్టుబడిగానుంచిన ధనము హుగ్లీనదిలో పడిపోయినదో లేక ఆద్రివ్యము ఇటుకలకు గారకు వెచ్చింపబడెనో తెలిసికొనవలసిన జరూరు లేకపోయినది. అందువల్ల ఈప్టుఇండియా రైల్వేలపైన విశేషముగా ధనము వెచ్చింపబడినది. ఒక్కమైలు రైలువేయుటకు 30000 పౌనులు కర్చయినది." ఇదేవిషయమై రమేశదత్తుగా రిట్లు చెప్పినారు: "బ్రిటిషు వ్యాపారస్తుల విశేష పలుకుబడివల్ల ఇండియా దేశమున రైల్వేలకై కర్చుపెట్టబడిన ధనమునకు ఇండియా గవర్నమెంటువారు తమ రివిన్యూలోనుండి వడ్డీ యిచ్చుటకు పూచీపడినారు. 1900 సంవత్సరమువరకు రైల్వేలు వేయుటకు 225 మిలియనుల పౌనులు కర్చుపెట్టబడినవి. అందువల్ల ఈ సంవత్సరమువరకు భారతరైలుకు 40 మిలియను పౌనులు నష్ట

మైనది. కాని 1900 సంవత్సరమువరకు ఇండియాగవర్న మెంటు వారు భారతదేశపు వ్యవసాయాభివృద్ధికి యేమిన్నీ పాటుపడలేదు. 1900 సంవత్సరమువరకు వ్యవసాయాభివృద్ధికై 25 మిలియను పౌనులు కర్చుపెట్టబడినవి. భారతదేశమున అప్పటికి సాగగు చుండిన రెండువందల మిలియను యెకరములలో 20 మిలియను ఎకరములకు మాత్రమే ఈ సౌకర్యము లభించినది. రైల్వేలు అభివృద్ధియైనకొలదియు భారతదేశములో ముఖ్య జీవనోపాయమైన వ్యవసాయాభివృద్ధి వెనుకబడిపోయినది. 1878 సంవత్సరమువరకు రైల్వేలపైన 170,000,000 పౌనులు కర్చుపెట్టబడినవి. ఇదే సంవత్సరమువరకు నీటివసతులపైన 16,000,000 పౌనులు కర్చుపెట్టబడినవి. 1930–31 సంవత్సర మువరకు భారతదేశమున సాగగుభూమిలో 21.7% కుమాత్రమే నీటివసతులు కల్పింపబడినవి."

రైల్వేలు వేయుటకై విశేషముగా ధనము ఖర్చు పెట్టబడుటవల్ల రైల్వేబడ్జెట్టులో అప్పటప్పటికి వచ్చు లోటును భర్తీచేయుటకై భారతదేశములోని భూమిశిస్తు మాటిమాటికి హెచ్చింపబడినది.

భారతదేశములోని కోస్తా వ్యాపారములోను, స్టీమరు వ్యాపారములోను బ్రిటిషువారు విశేషముగా పెట్టుబడి పెట్టినారు. అందువల్ల భారతదేశముయొక్క సముద్రవ్యాపార మంతయు బ్రిటిషువారి చేతులయందున్నది. కోస్తావ్యాపారములో భారతీయ నావల వంతు 13% న్ను సముద్రవ్యాపారములో 2% న్ను ఉన్నది.

ఇందుకుతోడుగా బ్రిటిషువారి పెట్టుబడి ధనమువల్ల భారతదేశములోని బ్యాంకింగు విధానమంతయు బ్రిటిషువారి చూటపైన నడచుచున్నది. బ్యాంకులయందుండు డబ్బువల్ల బ్రిటిషు వారు భారతదేశపు ఆర్థికాభివృద్ధికిన్ని, పరిశ్రమాభివృద్ధికిన్ని తీరనియాటంకములు కలిగించుచున్నారు. ప్రపంచ యుద్ధము ప్రారంభమగువరకు బ్రిటిషువారికి భారతదేశములో మూడు రాష్ట్రీయ బ్యాంకులు (Presidency Banks) మాత్రమే వుండినవి. ఈమూటి యభివృద్ధికిని సర్కారువారు సర్వవిధముల సాయపడిరి. ఇవికాక మరికొన్ని మారకపుబ్యాంకులున్ను, (Exchange Banks) కొన్ని జాయింటుస్టాకు కంపెనీలున్ను సహకార బ్యాంకులున్ను వుండినవి. 1931–32 సంవత్సరమునకు బ్రిటిషువారి బ్యాంకింగు కంపెనీలు 29 అయినవి. వీనిలో పెట్టుబడి ధనము 99.3 మిలియను పౌనులు.

భారతీయ జాయింటుస్టాకు కంపెనీలు మెల్లమెల్లగా అభివృద్ధియై 1914 సంవత్సరమునకు బ్రిటిషువారి రాష్ట్రీయ బ్యాంకులలోని పెట్టుబడి ధనములో ⅔ వంతు సంపాదించ గలిగినవి. ఈమొత్తము 3.7 కోట్ల రూపాయలు. ఈ భారతీయ బ్యాంకులు 1912–1916 సంవత్సరములలో చాల దుస్థితి ననుభవించి మరల 1920 సంవత్సరములో అభివృద్ధిమార్గము పట్టి 8.37 కోట్ల రూపాయల పెట్టుబడి సంపాదించ గలిగినవి. ఈ అభివృద్ధిని బ్రిటిషువారు సహించలేదు. బ్రిటిషుబ్యాంకుల వత్తిడివల్ల భారతీయ బ్యాంకులన్నియు ఇంపీరియల్ బ్యాంకు వశమైనవి.

ఈబ్యాంకు బ్రిటిషువారిదే. ఈ ఇంపీరియల్‌బ్యాంకు ఇండియాలోని మూడు రాష్ట్రీయ బ్యాంకులు కలిసి యేర్పడినదే. ఇందులోని ధనమంతయు బ్రిటిషువారిదే. అందులో పరిపాలన యంతయు బ్రిటిషువారి చేతులయందున్నది. బ్రిటిషువారి మూడు రాష్ట్రీయ బ్యాంకుల సమ్మేళన మగుటవల్ల యీ ఇంపీరియల్ బ్యాంకు భార తీయుల కేవిధముగగాని సాయపడలేదు. అంతేకాక భారతీయ ఆర్థిక సౌకర్యములకు వ్యతిరేకముగా వ్యవహరించుచున్నది. 1912–16 వరకు భారతీయుల బ్యాంకు లనుభవించిన దుస్థితికి బ్రిటిషువారి రాష్ట్రీయ బ్యాంకుల ఉదాసీనతయే కారణము. ఈ ఇంపీరియల్ బ్యాంకు పరిపాలనవల్ల భారతీయ వ్యాపారమునకు గాని పరిశ్రమలకుగాని యేవిధమైన సహాయమున్ను దొరకలేదు. కాని బ్రిటిషు వ్యాపారాభివృద్ధికిని, పరిశ్రమాభివృద్ధికిని సర్వవిధ ముల సహాయపడినది. బ్రిటిషువారి పెట్టుబడిధనము వారి బ్యాంకుల నుండి మెల్లమెల్లగా భారతీయ పరిశ్రమలలో ప్రవే శించి వానిని తమవశము చేసుకొన్నది. భారతీయ దూది పరి శ్రమ, ఇనుముపరిశ్రమ వీనిలోమాత్రము భారతీయులధన మెక్కువ. తక్కినపరిశ్రమలలో బ్రిటిషువారిదే పైచేయి.

భారతీయ దూదిపరిశ్రమ (Cotton Textile Industry) మాత్రము మొదటినుండియు భారతీయుల పెట్టుబడి ధనమువల్లనే నడుపబడుచున్నది. బ్రిటిషువారు యీపరిశ్రమ తమ మ్యాన్ చెస్టరుకు శత్రుసమమని తలచి తామేవిధముగను సాయపడలేదు. 1928 సంవత్సరమునకు యీపరిశ్రమలో 39 కోట్ల రూపాయలు

పెట్టుబడిధన ముండినది. అందులో 203,000 పౌనులు మాత్రమే భారతీయులుకానివారిది. ఈపరిశ్రమకాక భారతీయ జనుప పరిశ్రమ (Jute Industry) ఇంగ్లీషువారిచే స్థాపింపబడి అందులో భారతీయుల పెట్టుబడి పెరిగినను యిప్పటికిని యీ పరిశ్రమ పరిపాలనయంతయు బ్రిటిషువారి చేతులయందే యున్నది. భారతదేశమున బ్రిటిషువారు తమయొక్క విశేషమగు పెట్టుబడి ధనమువల్ల ఇనుము, ఉక్కు, పరిశ్రమలను స్థాపించిరి. అందులో బెంగాలు ఇనుము, ఉక్కు, కంపెనీ (Bengal Iron and Steel Company) మొన్నమొన్నటి వఱకును యీ దేశమున అగ్రస్థానము వహించియుండినది. 1907 సంవత్సరమున తాతా వారి ఇనుము, ఉక్కు, పరిశ్రమ స్థాపింపబడి మెల్లగా వృద్ధిచెందుచు 1925 సంవత్సరములో బ్రిటిషువారి బెంగాలు ఇనుము ఉక్కు పరిశ్రమను తనలో చేర్చుకొన్నది. భారత దేశమునందలి బొగ్గు పరిశ్రమలోను, తేయాకు తోటలయందును బ్రిటిషువారు విశేష ధనమును పెట్టుబడిగా పెట్టి తమ చేతులయం దుంచుకొన్నారు. 1931—32 సంవత్సరములో భారతదేశపు వ్యాపారములయందును, పరిశ్రమలయందును ఇతరుల పెట్టుబడి ధనము 1008 కోట్ల రూపాయలు.

బ్రిటిషువా రీదేశమున పెట్టుబడిపెట్టిన ధనములో ఎక్కువ భాగము ఇండియాసర్కారువారికి అప్పుగానిచ్చిరి. ఇండియా సర్కారువారు చేసిన యిటువంటి అప్పులే భారతదేశపుఋణ మన బడును. ఇట్టి అప్పులు సర్కారువారు భారతదేశపు సౌభాగ్య

మునపు చేసినవిగావు. కాని బ్రిటిషు సామ్రాజ్య రక్షణకై చేయ బడినవి. ఈ అప్పులలో చాలభాగము బ్రిటిషు సామ్రాజ్య రక్షణకై చేయబడిన యుద్ధముల నిమిత్తము చేయబడినది.

భారతదేశము 1857 సం॥పు అబిసీనియా యుద్ధమునకై 600,000 పౌను లచ్చుకోవలయును. 1875 సం॥పు పార్కు దండయాత్ర (Park Expedition) కై 41,000 పౌను లివ్వ వలయును. రెండవ ఆఫ్ఘన్ యుద్ధమునకై 17,000,000 పౌను లచ్చుకొనవలయును. 1882 సం॥పు ఈజిప్టు రక్షణ Egyptian operations) కు 200,000 పౌను లిచ్చుకోవలయును. 1882–1891 సం॥లోని ఫ్రాంటియరు దండయాత్రకై 1,300,000 పౌను లొసగవలయును. 1886 సంవత్సరపు బర్మాయుద్ధమునకై 4.7 మిలియను పౌను లివ్వవలయును. 1914–19 ప్రపంచ సంగ్రామమునకుగాను భారతదేశము భరించిన సైన్యపు ఖర్చు గాక 170.7 కోట్ల రూపాయ లర్పింపవలయును.

ఈ జాతీయఋణము (Public Debt) లో చాలభాగము భారతదేశమును శాశ్వతపు దాసత్వముక్రింద నణగద్రొక్కి యుంచుకొనుటకై బ్రిటిషువారు చేసినది. మితిమీరిన సైన్యపు వ్యయమువల్ల మాటిమాటికి వచ్చు లోటులను భర్తీచేయుటకై సర్కారువారు చేసిన అప్పు లిందులో నున్నవి. ఇండియా సర్కారువారి మారకపు రేటులోని అపకతవకలకయ్యు, కాటక నివారణకును, రైల్వేలు కాలువలు వేయుటకును, ఇంగ్లాండు లోని ఇండియా ఆఫీసు ఖర్చుల నిమిత్తమును, భారతదేశపు

నకు బయటనుండు బ్రిటిషువారి యితర రాజ్యముల పరిపాలన కున్ను, భారత రాష్ట్రప్రభుత్వముల అప్పులకున్ను యీజాతీయ ఋణము చేయబడినదట. ఈఅప్పులన్నియు కలిసి 1934 సంవత్సరము మార్చినెల 31 వ తేదీకి రు. 1212 కోట్ల రూపాయలున్నది. ఇందులో 512 కోట్ల రూపాయలు బ్రిటను దేశమునందు అప్పుచేయబడినది,

1911 సంవత్సరమునకు భారతదేశమునందు బ్రిటిషువారి పెట్టుబడిధనము 365 మిలియను పౌను లున్నదని సర్ జార్జిపైషాగారు చెప్పినారు. ప్రపంచ యుద్ధమునకు తరువాత యీపెట్టుబడి పెరిగిపోయినది. 1929 సంవత్సరమునకు భారతదేశములో బ్రిటిషువారి పెట్టుబడిధన మీక్రింది విధముగ నుండినదని పైయర్‌గారు చెప్పినారు.

| | మిలియనుపౌనులు. |
|---|---|
| సర్కారువారి స్టెర్లింగు అప్పు | 121 |
| గ్యారంటీడ్ రైల్వే అప్పు | 120 |
| 5% యుద్ధపు బాకి | 17 |
| భారతదేశమందు రిజిష్టరుకాబడిన కంపెనీలలోగల పెట్టుబడిధనము | 75 |
| ఇతర దేశములందు రిజిష్టరుకాబడిన కంపెనీలలోగల పెట్టుబడి ధనము | 100 |
| మొత్తము | 573 |

బ్రిటిషువారి పెట్టుబడి ధనము భారతదేశములో యీ దినమువరకు రు. 1300 కోట్లరూపాయలు లేక 1000 మిలియనుల పౌనులని అంచనా వేయబడినది. బ్రిటిషువారు యితర దేశములలో పెట్టియుండు పెట్టుబడి ధనమంతయు 4,000 మిలియను పౌనులు. ఈపెట్టుబడి ధనములో $\frac{1}{4}$ భాగము భారత దేశమునందున్నది. ఇండియాదేశము ప్రతిసంవత్సరము రు. 65 కోట్లరోపాయలు వడ్డి క్రింద యీపెట్టుబడి ధనమునకై చెల్లించ వలయును. ఈవడ్డిరేటు 5%. ఈమొత్తమేకాక యేటేట ఇండియా దేశము బ్రిటనుదేశమునకు, ఫించనులకున్ను, అలవెన్సులకున్ను యితర దేశములందలి ఇండియా గవర్నమెంటు వ్యవహారము లకున్ను, ఇండియాలోని బ్రిటిషు వర్తకకంపెనీలకున్ను, లాభము లకున్ను మిగుళ్ళకున్ను, కమీషన్‌లకున్ను, చాల మొత్తములు యిచ్చుకోవలసియున్నది.

భారతదేశము ఇతరదేశములకున్ను, బ్రిటనుకున్ను యేటేట 161 కోట్లరూపాయలు చెల్లించవలయును. ఈ మొత్తములో ఇండియా గవర్నమెంటువారు బ్రిటనుకు, సివిలు వుద్యోగుల ఫించనులకున్ను, బ్రిటనులోని సివిల్ మిలిటరీ ఖర్చులకును యేటేట పంపుచుండు కోట్ల రూపాయ లిందులో చేరలేదు.

ఈ మొత్త మీవిధముగా నున్నది.

| | కోట్లరూపాయలు |
|---|---|
| 1. బ్రిటిషువారియొక్కయు, యితర దేశముల యొక్కయు ఓడల వ్యాపారసంఘములకు | 35 |

| | | |
|---|---|---|
| 2. | మారకపు నిబంధనవల్లను, కమిషన్‌లకున్ను బ్రిటిషువారియొక్కయు, ఇతరదేశములవారి యొక్కయు బ్యాంకుల కివ్వవలసినమొత్తము | 21 |
| 3. | బొగ్గు, టీ, జనుపపరిశ్రమలలో పనిచేయువారి లాభములు, జీతములుచేరి | 40 |
| 4. | బ్రిటిషువారి పెట్టుబడి ధనముపైన వడ్డీ 5% తో | 65 |
| | | 161 |

ఇండియా సర్కారువారు యేటేట ఇతర దేశములకు పంపుచున్న మొత్తము యిందులో కలిపినచో యేటేట భారతదేశమునుండి 180 కోట్ల రూపాయలు బయటికి పోవుచున్నవి.

భారతదేశముయొక్క ఎగుమతులు దిగుమతులకన్న చాల రెట్లు తక్కువగుటచే యీదోపిడి జరుగుటకు సాధ్యమగుచున్నది. భారతీయులు తాము దిగుమతిచేయు తయారైన వస్తువులకుగాను తమయొక్క తిండిపదార్థముల ఎగుమతి చేయవలసి వచ్చినది. అందుచే యీదేశమున తిండి కరవైనది. పరిశ్రమలకు కావలసిన ముడివస్తువులు లేకపోయినవి. ప్రస్తుతపు ప్రపంచ ఆర్థిక మాంద్యమువల్ల భారతదేశపు ఎగుమతులకు విలువ పడిపోయినది. అందువల్ల భారతదేశము యితర దేశములకు ఎగుమతి చేయవలసిన సరకులకు బదులుగా, బంగార మెగుమతి చేయవలసి వచ్చినది. ఈబంగారపు దోపిడి నిరాటంకముగ జరుగుచున్నది. ఈ క్రింద కనుబరచిన రీతిగా 1931 సం॥ నుండి భారతదేశము నుండి యితరదేశములకు బంగారు వెళ్ళిపోయినది.

| సంవత్సరము. | | విలువ (రూపాయలలో) |
|---|---|---|
| 1931–32 | .... | 60,78,25,155 |
| 1932–33 | .... | 66,84,09,347 |
| 1933–34 | ... | 58,15,30,246 |
| 1934–35 | .... | 53,25,68,708 |
| 1935–36 | .... | 38,30,55,365 |

బ్రిటను బంగారు మారకపురేటును (Gold Standard) వదలు కొన్న నాటినుండి 1937 సంవత్సరము మార్చినెల మొదటి వారము వరకు రు. 29,93,074,345 రూపాయల విలువగల బంగారు భారతదేశము విడిచిపోయినది.

పై విషయమై బ్రిజినారాయణగా రిట్లు చెప్పుచున్నారు. "భారతదేశము అచ్చువలసిన స్టెర్లింగు అప్పుగాక, ఇండియా సర్కారుకున్ను, వ్యాపారమునకున్ను, యేటేట 43 మిలియను పౌనులు భారతదేశమునకు కావలసియున్నది. అందువల్ల భారతదేశమునకు తన వ్యాపారములో లాభము రానిపక్షమున ఆలోటును బంగారు ఎగుమతిచేసిగాని, లేక తననాకీ మొత్తమునకు చేర్చిగాని చేయవలయును. లేనియెడల తన ఎగుమతులు అభివృద్ధి చేసుకోవలయును. లాభమురాక పడిపోయిన ఎగుమతులకు బదులుగా వేరే ఎగుమతులు చూచుకొనవలయును. ఈ బంగారపు ఎగుమతి మితిమీరిపోవుటవల్ల మారకసిద్ధాంతము తలకిందులై దేశము కోలుకోలేని పరిస్థితు లేర్పడినవి."

# భారతీయ రైతు

ఈష్టుఇండియా కంపెనీవారి పరిపాలన దినములలోనే భారతదేశమునందు చాలచోట్ల జమీందారీ పద్ధతి అమలులోనికి వచ్చినది. హిందూమహమ్మదీయ చక్రవర్తుల కాలమందు భూమిపైన హక్కు, అధికారము, రాజుకుగాని లేక రైతుకుగాని వుండినదిగాని మధ్యరకపు జమీందార్లకుగాదు. ఈ విషయమునే చాలమంది పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసినారు. ఈజమీందారులాకాలమందు భూమిశిస్తు వసూలు చేయుచుండిరి. అందుకై గౌరవార్థముగా కొంతభూభాగము వీరికి హిందూ మహమ్మదీయ చక్రవర్తు లొసగిరి. అట్టి భూమిపైన వీరికి అధికార మేమాత్రముగాని యుండినదికాదు. పదునేడు, పదునెనిమిదవ శతాబ్దములందు మొగల్ చక్రవర్తుల పరిపాలనలో యిట్టి శిస్తు వసూలుదార్లు (Revenue Collectors) శిస్తువసూలు చేయు రైతులు (Revenue farmers) చాలమంది యుండిరి. రాజ్య వైశాల్య మెక్కువగుటవల్లను పరిపాలనా సౌష్ఠవ మంత దిట్టముగా లేనందువల్లను గుత్తలు వసూలగుటకుగాను యిట్టివారి నేర్పరుపవలసి వచ్చినది. మొగల్‌రాజ్య పతనానంతరము కేంద్ర ప్రభుత్వాధికారము చెడిపోయినందున పైపేర్కొనిన యీ రివిన్యూకలెక్టరులు, రివిన్యూ వసూలుచేయు రైతులు, తమ యధీనమందుండిన భూభాగమునకు తామే యజమానులైరి. సైక్సు (Sykes) అనునతడు చౌడ్‌లో గుత్తలు వసూలు చేయుచున్న తాలూకాదార్లు తనయొక్క

ఎస్టేట్ల నేరీతిగా యెక్కువచేసికొనిరో యీ క్రింది రీతిగా చెప్పినాడు.

(1) తాలూకాదార్లు తమకంటె బలహీనులైన తాలూకా దార్లనుండి బలవంతముగా భూమిని గైకొనిరి.

(2) బలములేని తాలూకాదార్లపై అపద్ధపు కేసులు పెట్టి, వంచించి, మోసగించి వారిభూమిని గుంజుకొనిరి.

(3) బలవంతపరచియు, రహస్యపు యాలములు వేసియు భూమిని సంపాదించిరి.

(4) బాకీయుండిన భూమిశిస్తుకై యాలమువేసి నిరంకుశముగా భూమిని స్వాధీనము చేసుకొనిరి.

(5) అమాని (Amani - Trust) పద్ధతి మేరకు సర్కారువారి ప్రతినిధులు రివిన్యూకలెక్టరు లివ్వవలసిన మొత్తాలకు భూములను యాలమువేసి కట్టుకొనిరి.

(6) భూమిగుత్తకై భూముల నాయక ముంచుకొని తరువాత తామే స్వాధీనము చేసుకొనిరి.

(7) మరియు ననేకవిధములైన కుతంత్రముల ద్వారా భూమిని సంపాదించిరి.

పై విధముగ రైతుయొక్క భూమిని స్వాధీన పరచుకొన్న యీ రివిన్యూ కలెక్టరులలో చాలమంది రైతువంశములోని వారు కారు. 1858 సంవత్సరమున లార్డుకానింగు గారు వీరివిషయ

మున నిట్లు వ్రాసినారు. "1856 సంవత్సరమున మేము చౌడ్ గవర్నమెంటును స్వాధీన పరచుకొన్నపుడు యీ రాజధానిలో చాలభాగము తాలూకాదార్లవశమునం దుండెను. వీరిని చౌడ్ జాగీరుదార్లు (Barons of Oudh) అనుచుండెడివారు. అయితే యీబిరుదు అబద్ధము. కొందరికి సర్కారువారీబిరుదమిచ్చిరి. కొందరు రాజుల నాశ్రయించి సంపాదించిరి. కాని చాల మంది పూర్వపు జాగీరుదార్ల వంశములోనివారుకారు. పుట్టుకవల్లగాని యోగ్యతవల్లగాని వీరు గొప్పవారుకారు. వీరికి వ్యవసాయము తెలియదు. భూమిపైన వీరికి యేవిధమైన హక్కుగాని అనుభవ ముగాని లేదు. వీరు నైజాముల పరిపాలనకాలమందు గవర్న రులుగను, సర్కారు గుత్త వసూలు చేయువారుగను యుండి నైజాము ప్రభుత్వమునందు బలము తగ్గినతోడనే విజృంభించి అనేక యుపాయములతో తమ అధీనమందుండిన ప్రదేశములకు తామే యజమానులైరి. భూసంపాదనలో వీరు చాల అన్యాయ ముగా ప్రవర్తించిరి, అబద్ధపు యాలములుపెట్టి భూమిని స్వాధీన పరచుకొనిరి. కొన్ని సందర్భములయందు దౌర్జన్యముగా రైతు నుండి భూమిని గుంజుకొనిరి. ఈరీతిగా రైతుయొక్క భూమిని తాము స్వాధీనము చేసుకొని జమీందార్లయిరి. వీరు తమ యధీన మందుండిన ప్రదేశములకు తాలూక్సు అనియు ఎస్టేటులనియు పేరుపెట్టుకొనిరి. భూమిశిస్తువల్ల వచ్చుద్రవ్యమే ప్రధానముగా నెంచిన నైజాము ప్రభుత్వము తననౌకర్లుచేయు దుండగము లను విచారించి దండించక పోవుటచే వీరు విజృంభించి జాగీరు దార్లగుట కవకాశ మేర్పడినది."

బ్రిటిషువారు రాజ్యాధికారము వహించినతోడనే దేశ మందు భూసంపాదన విషయములో జరిగిన అన్యాయములను అక్రమములను గ్రహించిరి. వ్యవసాయదారుని చేతినుండి భూమి యేరీతిగా జారి యీతాలూకాదార్ల చేతులలో పడినదో వారు గ్రహించిరి. బ్రిటిషువారు భూములను మరల వ్యవసాయ దారున కిచ్చి భూమిశిస్తు అతనిగుండా వసూలు చేయుటకు వలయు నేర్పాట్లయినను చేయవలయును, లేదా యీ యెస్టేటుదార్లనే భూకామందులుగా నంగీకరించి భూమిశిస్తు వీరివల్ల వసూలు చేయ వలయును. బెంగాలు, బీహారు, సంయుక్తపరగణాలు మద రాసురాజధానిలో దక్షిణభాగము యీ ప్రదేశములం దుండిన తాలూకాదార్లనే భూకామందులుగా అంగీకరించిరి. వాస్తవమైన రైతుకు భూమిలేకపోయినది. ఈపనిలో బ్రిటిషువారి రాజ్యరక్షణ సూత్రమే ముఖ్యముగా గమనింపబడినది. ఈజమీందారీ సెటిలు మెంటువల్ల భారతదేశములో తమకెప్పుడును సాయపడునట్టి ఒకతెగ భారతీయులను బ్రిటిషువారు ఏర్పరచుకొనిరి. తిరుగుబాటు గావించిన రైతును అణచుటకు యీజమీందార్లు బ్రిటిషువారికి చేదోడు వాదోడుగా ప్రవర్తించిరి. ఇందువల్ల భూమిపైన వాస్తవమైన హక్కుగలిగి వ్యవసాయముచేయు కోట్లకొలది రైతులకు భూమి లేకపోయినది.

1858 సం॥రమున శిపాయీల తిరుగుబాటు అణచిన తరువాత ఔడ్‌లోని తాల్లూకాదార్ల వశమందుండిన భూములను సర్కారువారు స్వాధీనము చేసుకొనిరి. ఈవిషయమై క్యానింగు

ఓ్ట్రమ్‌కు జవాబుచెప్పుచు యిట్లు చెప్పెను. "ప్రస్తుతము చౌడ్‌లో జమీనుదారీ సెటెల్‌మెంటు పెట్టవలయునో, లేక రైతు వారీ సెటిలుమెంటు పెట్టవలయునో, యిందులో యేది సర్కారు వారికి లాభమో గవర్నరుజనరలు బాగా యోచించవలయును. ఈ ప్రశ్న నాకు సంబంధములేదు. వాస్తవము చెప్పవలసినచో వ్యవసాయముచేయు రైతునుండి, అన్యాయముగాను, నీచము గాను, దౌర్జన్యముగాను భూమిని లాగుకొని యీ తాలూకాదార్ల వశముచేసిరి."

జమీనుదారీ పద్ధతిలో రైతు రానురాను నశించిపోవు చున్నాడు, సర్వాధికారులైన యీ జమీందార్లచేతిక్రింద రైతు నలిగిపోవుచున్నాడు. రైతుకును జమీందార్లకును మధ్య కౌలుదార్లు (Tenents and Sub-tenents) అను మరియొక చిన్న జమీందార్లు బయలుదేరినారు. వీరు యీజమీందారీ రైతుయొక్క నిస్స హాయ స్థితి గ్రహించి అతని రక్తమును పీల్చుచున్నారు. వీరి వల్లనే భూములను కట్టుగుత్తకిచ్చు (Rack renting) పద్ధతి అమ లులోనికి వచ్చినది. గుత్తయిచ్చుకోలేని రైతును భూమినుండి తొలగించు పద్ధతి సర్వసాధారణముగా అమలులో నున్నది. న్యాయవిరుద్ధమైన కారణములవల్ల జమీందారీలో భూమిశిస్తు విశేషముగా పెరిగిపోయినది. ఇట్టి విధానముల నరికట్టుటకు సర్కారువారు కొన్నికొన్ని చట్టములుకూడా చేసినారు.

ప్రస్తుతము జమీందారీ ప్రదేశములలోని రైతుయొక్క స్థితి పూర్వము కంటె చాలదుఃఖకరముగా నున్నది.

భూములను గుత్తల కిచ్చుట, గుత్తను బలవంతముగ వసూలుచేయుట, కారణములేకనే భూమిశిస్తును మాటి మాటికి హెచ్చించుట, యేదో మిషపెట్టి భూమిని రైతుచేతి నుండి లాగుకొనుట మొదలగు యెన్నియో అన్యాయ కృత్యము లిప్పటికిని జమీందారీ ప్రదేశములందు జరుగుచున్నవి. కడచిన కొన్ని సంవత్సరముల నుండి ధాన్యపు విలువ పడిపోయినందున జమీందారీ రైతు భూమిశిస్తు యిచ్చుకోలేక సర్వవిధముల క్షీణించి పోవుచున్నాడు. రైతు ఋణభారము సహింపరాని పరిస్థితు లేర్పడినవి.

రైతువారీ ప్రదేశములందలి - రైతుయొక్క స్థితి కొంత మేలు. ప్రపంచమునం దెచ్చటను విధింపబడనంత భూమిశిస్తు యీదేశములో విధింపబడుచున్నది. ఈశిస్తు రైతు యిచ్చుకో లేడు. అందువల్ల శిస్తు చెల్లించుటకై అప్పుచేయు పద్ధతి యేర్పడినది. రైతుయొక్క భూమి రానురాను ఋణదాతల వశ మగుచువచ్చినది. ఇందుమూలమున రైతువారీ ప్రదేశములలో వడ్డీ వ్యాపారులు, పెద్దపెద్ద భూకామందులు, యేర్పడినారు. వీరు బలవంతు లగుచున్నారు. వీరు రైతును పెట్టుబాధ జమీం దారు రైతులను పెట్టుబాధ కేమాత్రమునూ తీసిపోదు. జమీం దారీ రైతులను రక్షించుటకు టెనెన్సీ చట్టములైన నున్నవి గాని రైతువారీ రైతును రక్షించువారులేరు.

పై పరిస్థితులలో భారతీయరైతుకు తినుటకు తిండి, కట్టుటకుగుడ్డ కరవైనవి. రైతు ఋణభారముచే కృంగి కృశించి

పోవుచున్నాడు. అతనిని, వడ్డి వ్యాపారులును, సర్కారు నౌక రులును, భూకామందులును పెట్టునట్టి బాధ మితిమీరి పోవు చున్నది.

పూర్వపు గ్రామపరిపాలన చెడి, గ్రామ పరిశ్రమలు నశింపబడుటచేత నట్టిపరిశ్రమలవల్ల జీవించుచుండిన వారందరు భూమిపైన పడవలసిన పరిస్థితు లేర్పడినవి. 1881 సం॥ నందు యీదేశములో వ్యవసాయమువల్ల జీవించుచుండినవారు నూటికి 58% మంది ఉండిరి. 1891 సం॥ నకు నూటికి 61.06% కున్ను 1901 సం॥ నకు నూటికి 66.5% కున్ను 1921 సం॥ నకు నూటికి 71.6% కున్ను పెరిగిరి. 1927 సం॥ నందు రాయలు కమీషన్ వారి వ్యవసాయ రిపోర్టువల్ల యీదేశములో వ్యవసాయమువల్ల జీవించువారు నూటికి 73.9% మంది యని తేలినది.

భూమిపై నాధారపడి జీవించువారిసంఖ్య పెరిగిన కొలదియు రైతుకు జీవించుటకు కావలసినంత భూమి లేకపోయి, భిన్నా భిన్నముగాను, ఆర్థికముగా నిష్ప్రయోజన మైనదిగాను నైనది. హారోల్డుమాన్ తనయొక్క 'సర్వే ఆఫ్ దక్కన్ విలేజ్' అను పుస్తకములో నిట్లు వ్రాసినాడు. "గడచిన అరు వది డెబ్బది సంవత్సరములుగా రైతుకు జీవించుటకు వలసినంత భూమిలేక మెల్లమెల్లగా తగ్గి చాల విధములుగా మారినది. ఇం గ్లీషువారు యీదేశమునకు రాకపూర్వమును వచ్చిన తొలి దిన ములలోను రైతుకు జీవించుటకు వలయునంత భూమియుండెడిది.

ప్రతివ్యవసాయదారునకు పదియెకరములకంటె తక్కువయుండెడిది కాదు. రెండు మూడు ఎకరముల భూమిగల రైతు అప్పటిలో నరుదు. ఇప్పుడు భూమిగలవారి సంఖ్య రెండంత లైనది. నూటికి యెనబైమందికి పదియెకరముల భూమియైన లేక పోయినది. నూటికి అరవైమందికి అయిదు ఎకరములైనా లేదు."

1926 సం॥పు ఇండియా వ్యవసాయపు జర్నల్ (Agricultural Journal of India for 1926) వల్ల నూటికి 23 మందికి ఒకయెకరము అంతకంటె తక్కువగాను, నూటికి 33 మందికి ఒకయెకరము నుండి అయిదు ఎకరములవరకును, నూటికి 20 మందికి అయిదు నుండి పది ఎకరములవరకును నూటికి 24 మందికి పది ఎకరములపైనను వ్యవసాయమునకు తగిన భూమి యున్నదని తెలిసినది. బ్రిటిషు ఇండియాలో భూమిలేని వ్యవసాయదారులు 350 లక్షలమంది యున్నారు.

వ్యవసాయము చేయుటకు తగినంతభూమి లేకపోవుట వల్లను, పండిన పంటలకు ధర పడిపోవుటవల్లను తాను వ్యవసాయమువల్ల సంవత్సరమూ సంపాదించు మొత్తము భూమి శిస్తుకున్ను, భూకామందుకు అచ్చవలసిన కట్టుగుత్త (ధాన్యము లేక మొత్తమున)కున్ను చాలకయున్నది. పాపము! రైతు సంవత్సరమున కొకనాడైన కడుపునిండ మంచిభోజనము చేయునట్టి పుణ్యము నోచుకోలేదు. అందువల్ల రైతు అప్పుచేసి జీవించవలసి వచ్చినది. ఈ యప్పు నానాటికి పెరిగిపోయినది.

1930 సంవత్సరమున 'కేంద్ర బ్యాంకింగు విచారణ సంఘము' వారు బ్రిటిషు ఇండియాలోని రైతుకు రు. 900 కోట్ల రూపాయల అప్పు ఉన్నదని అంచనా వేసిరి. నేటికి యీఅప్పు రెండంతలైనది. ఈనాటిఋణము 1500 కోట్లు. అప్పుపైన సాహుకార్లు నూటికి 12 నుండి 75 వరకు వడ్డి విధించుచున్నారు. కొన్నికొన్ని సందర్భముల యందు యీవడ్డిరేటు 300% గలదు. చదువురాని రైతుయొక్క అమాయకపుస్థితి గ్రహించి సాహుకార్లు అపద్ధపు పద్దులు వ్రాసియు అంకెలు హెచ్చుతగ్గులు చేసియు, అప్పు యిచ్చుటకు ముందు కాలీకాగితములమీద బొటనవ్రేలిగుర్తులు వేయించుకొనియు నానావిధముల అతని అప్పును యెక్కువ చేయుచున్నారు. అప్పుతీర్చుటకై తరతరములుగా సాహుకార్ల యిండ్లయందు బానిసలుగా నుండు రైతులుగూడ కలరు. సహకార సంఘముల వల్ల రైతుఅప్పు యేమాత్రమును తగ్గలేదు. ధనవంతులగు వ్యవసాయదార్లకు కొంత మేలు కలిగియుండిన కలిగియుండ వచ్చును. విపరీతపు వడ్డిరేటును తగ్గించుటకు కొన్ని రాష్ట్ర ప్రభుత్వములు చట్టములు గావించినవి. అందువల్లకూడా సాధారణ రైతుకు ప్రయోజనములేదు. ప్రస్తుతము రైతు సాహుకార్ల అదుపు ఆజ్ఞలకు లోబడి యుండునంత దీనముగా మరెప్పుడును యేకాలమందును లోబడి యుండలేదు. రైతుపైన సాహుకార్ల పెత్తన మిప్పుడు నిరంకుశముగా సాగుచున్నది.

# బ్రిటిషు సామ్రాజ్య తత్వము.

ఈ బ్రిటిషు సామ్రాజ్యతత్వముయొక్క పరిణామము పై విధముగానుండి యిందుకు తోడుగా భారతజాతీయ జీవితము నందు ఆర్థికముగా చాల మార్పులువచ్చినవి.

భారతదేశమున ప్రతివ్యక్తియొక్క ఉత్పత్తిచేయు శక్తి యితర దేశములలోకంటె చాలతక్కువ. 1921–22 సంవత్సరములో నీ దేశమున ప్రతివ్యక్తియొక్క ఉత్పత్తి శక్తి వ్యవసాయము వల్లను, పరిశ్రమలవల్లను సంవత్సరమునకు 71 రూపాయలు. బ్రిటిషువారి యితర రాజ్యాలలో రు. 531 లు, అమెరికాలో 1003 రూపాయలు; కెనడాలో 851 రూపాయలు; జపానులో 234 రూపాయలు. ప్రపంచ ఆర్థిక మాంద్యము రాకమునుపు ఇతర దేశములయందు ప్రతివ్యక్తి యొక్క వుత్పత్తి ఆదాయ మీక్రిందివిధముగా నుండినది.

| | దేశము | వ్యక్తియొక్క ఉత్పత్తి ఆదాయము సంవత్సరమునకు |
|---|---|---|
| 1. | బ్రిటిషు ఇండియా | రు. 82 |
| 2. | జపాను | 271 |
| 3. | ఫ్రాన్సు | 636 |
| 4. | యునైటెడ్ కింగ్‌డం | 1092 |
| 5. | కెనడా | 1268 |
| 6. | అమెరికా | 2053 |

ప్రపంచ ఆర్థికమాంద్యమువల్ల వస్తువులధర పూర్తి పడిపోయినది. అందువల్ల భారతదేశములో సంవత్సరమునకు సరాసరి వ్యక్తిఆదాయము 50 రూపాయలకంటె మించదు.

వ్యవసాయముచేయు రైతుచేతిలో చాలినంత భూమి లేనందువల్లను, భూకామందు పట్టణవాసు డగుటవల్లను, సర్కారు వారి జమీందాదారీపద్ధతివల్లను మరియు ననేకకారణములవల్ల భారత దేశపు భూమిలో చాలినంత, పండవలసినంత, పంటపండుటలేదు. సరాసరి యెకరమునకు యితరదేశములలో పండు పంటకంటె ఈ దేశమున పండు పంట చాల తక్కువ. ఈ క్రింది అంకెల వల్ల 1931—32 సంవత్సరములో ప్రపంచమునందు ఆ యా దేశాలలో సరాసరి యెకరాకు పండిన పంట తెలియును.

సరాసరి ఒక ఎకరాకుపండు పంట.

| | దేశము | బియ్యము | గోధుమలు |
|---|---|---|---|
| 1. | ఇటలి | 4,601 పౌన్లు | 1,241 పౌన్లు |
| 2. | జపాను | 2,767 | 1,508 |
| 3. | ఈజిప్టు | 2,356 | 1,688 |
| 4. | అమెరికా | 2,112 | 973 |
| 5. | బ్రిటిషు సామ్రాజ్యము | .... | 1812 |
| 6. | జర్మనీ | .... | 1740 |
| 7. | ఇండియా | 1357 | 652 |

ఇతర దేశములతో పోల్చిచూచిన భారతదేశమున పండు పంట అర్ధాంశము మాత్రము.

ప్రపంచమునందు ఉతర దేశములందు పరిశ్రమాభివృద్ధి గలుగుటవల్ల వ్యవసాయముచే జీవించువారి సంఖ్య తక్కువైనది. పరిశ్రమాభివృద్ధి యేమాత్రములేని భారతదేశములో వ్యవసాయమువల్ల జీవించువారి సంఖ్య యెక్కువైనది. ప్రస్తుతము ఈ దేశములో ప్రతినలుగురిలో ముగ్గురు వ్యవసాయమువల్ల జీవించువారున్నారు. ఇంగ్లాండు వేల్సులలో నూటికి 7 మంది వ్యవసాయముచేయువారు. అమెరికాలో నూటికి 22 మంది. కెనడాలో నూటికి 31.2 మంది. జర్మనీలో నూటికి 30.3 మంది. ఫ్రాంసులో నూటికి 38.3 మంది. జపానులో నూటికి 50.3 మంది వ్యవసాయమువల్ల జీవించువారున్నారు. ఈ పై అంకెలవల్ల భారతదేశములో బ్రిటిషు పరిపాలనలో పరిశ్రమాభివృద్ధి సున్నయని తెలిసినది. బ్రిటిషు సామ్రాజ్యతత్వమువల్ల భారతీయ సాంఘిక సౌష్ఠవము చెడిపోయినది.

వ్యవసాయమే జీవనాధారముగాగల భారతదేశపు రైతులకు ఆర్థికముగా సరిపోవునంత భూమి లేకపోయినది. భారతదేశములో సరాసరి ప్రతిరైతుకు యెకరా భూమి వచ్చుచున్నది. కానికొన్ని రాష్ట్రములలో 2½ ఎకరా వుండినను వుండవచ్చును.

భారతదేశపు రైతుయొక్కగృహము సదా దరిద్రదేవతకు నెలవు. ఇంతేగాక ఋణము వ్రణమై మెల్లమెల్లగా అతనిని కృంగదీయుచున్నది.

ఈ క్రింది అంకెలవల్ల భారతదేశము జాతీయ పరిశ్రమాభివృద్ధిలో యెంత వెనుకబడినదో తెలియుచున్నది. 1930 సం॥న ఈ దేశములో 8,148 కర్మాగారము లుండినవి. వీనిలో దాదాపు 700 కోట్ల రూపాయలు పెట్టుబడిధన ముండినది. ఈ మొత్తములో రు. 300 కోట్ల రూపాయలకు మించి భారతేతరులది. బ్రిటిషు సామ్రాజ్యము (United kingdom) 1928 సం॥న 107,500 కర్మాగారము లుండినవి. ఈ రాజ్యము లలోని జనసంఖ్య భారతదేశపు జనసంఖ్యలో 13 వ వంతు. ఆ రాజ్యములలోని కర్మాగారముల పెట్టుబడి ధనము 7067 కోట్లు రూపాయలు. లేక భారతదేశములోని పెట్టుబడి ధనముకంటె 23 రెట్లు యెక్కువ. భారతదేశపు జనసంఖ్యలో 35% జన సంఖ్యగల అమెరికాలో 174,136 కర్మాగారములున్నవి. వీనిలో రు. 23,000 కోట్ల రూపాయల పెట్టుబడిధనమున్నది. లేక భారతదేశములోని పెట్టుబడికంటె 75 రెట్లు యెక్కువ.

1930 సం॥లో భారతదేశములోని పెద్దపెద్ద కర్మాగా రములందు పనిచేయువారిలో భారతీయులు 1.5 మిలియనులు; లేక భారతదేశపు జనసంఖ్యలో 1%. చేతిపనులవల్ల జీవించువారు 10.2%. బ్రిటిషు సామ్రాజ్యములో 47.2%, అమెరికాలో 32%, జర్మనీలో 41.4%, ఫ్రాంసులో 33.3% జపానులో 19.5% మంది గలరు.

క్రింది అంకెలుబట్టి భారతదేశములో వ్యవసాయమువల్లను పరిశ్రమలవల్లను సరాసరి సంవత్సరమునకు ఒకనికి యెంత ఆదాయమో తెలియును.

ఒక్కని ఆదాయము

| | రాజ్యము | పరిశ్రమలు (రూపాయలు) | వ్యవసాయము (రూపాయలు) |
|---|---|---|---|
| 1. | ఇండియా | 12 | 59 |
| 2. | జపాను | 158 | 57 |
| 3. | స్వీడన్ | 384 | 129 |
| 4. | బ్రిటిషు సామ్రాజ్యము | 412 | 62 |
| 5. | కెనడా | 470 | 213 |
| 6. | అమెరికా | 721 | 175 |

భారతదేశమునందు కర్మాగార అభివృద్ధిదాయక పరిశ్రమలగు బొగ్గు, ఇనుము వీటియభివృద్ధి చాలతక్కువ. 1931 సం॥లో ఈదేశమున 22 మిలియనుల టన్నులు బొగ్గు ఉత్పత్తి అయినది, బ్రిటిషు సామ్రాజ్యములో (United kingdom) లో 223 మిలియను టన్నులబొగ్గు ఉత్పత్తి అయినది. జర్మనీలో 119 మిలియను టన్నుల బొగ్గు, ఫ్రాన్సులో 15 మిలియను టన్నులు బొగ్గు ఉత్పత్తి అయినవి. అమెరికాలో పై మూడు రాజ్యాలలో వుత్పత్తికాబడినంత బొగ్గు ఉత్పత్తి కాబడినది. ప్రతి సంవత్సరము భారతదేశములో 500,000 టన్నుల యినుము దొరకుచున్నది. ఇందుకు తోడుగా 1,000,000 టన్నుల యినుము దిగుమతి యగుచున్నది. ఆర్థికమాంద్యము (Crisis) వచ్చిన 1930 సంవత్సరములో అమెరికాలో 74,000,000 టన్నుల

ఇనుము వుక్కు ఉత్పత్తికాబడినది. నేటికిని భారతదేశము తన కర్మాగారములకు కావలసిన ఇనుము సామానులకు యితర దేశములపై నాధారపడవలసి యున్నది.

భారతదేశమున 27 మిలియనుల హార్సుపవర్ గల విద్యుచ్ఛక్తి యున్నది. దీనిలో 0.8 వంతు లేక 3% మాత్రమే ఉపయోగింపబడుచున్నది. అమెరికా దేశములో తనకున్న విద్యుచ్ఛక్తిలో 33% ఉపయోగింపబడు చున్నది. ఫ్రాన్సులో 37%, జపానులో 37%, జర్మనీలో 55% స్విడ్జరులాండులో 72% విద్యుచ్ఛక్తి ఉపయోగింపబడు చున్నది.

భారతదేశమునందు 1.8 బిలియన్ (Billion) కిలోవత్ గంటల (Kilowath hours) విద్యుచ్ఛక్తి ఉత్పత్తి గావింపబడుచున్నది. జపానులో 1931 సం॥లో 14 బిలియన్ క్విలత్ గంటల విద్యుచ్ఛక్తి వుత్పత్తియైనది. అమెరికాలో 115 బిలియన్ క్విలత్ గంటల విద్యుచ్ఛక్తి వుత్పత్తియగుచున్నది.

భారత దేశములో కర్మాగారములయందు యంత్ర శక్తికి బదులుగా మనుష్యశక్తి యెక్కువగా ఉపయోగింపబడుచున్నది. అనగా యెక్కువమంది పనిచేయుచున్నారనుట. అందువల్ల పనిచేయువాని వుత్పత్తిశక్తి చాలతక్కువ. ఆశక్తి ఈ దేశములో 0.47, అమెరికాలో 13.38, కెనడాలో 13.03, బ్రిటనులో 6.65, జర్మనీలో 6.04, ఫ్రాన్సులో 4.35, జపానులో 1,75 వున్నది.

బ్రిటనుకంటె భారతదేశములో యెక్కువమైళ్ళు రైల్వే వేయబడినది. ఇది బ్రిటనులోనుండు రైల్వే మైళ్ళకు రెండంత లుండును. కాని భారతదేశము తన వైశాల్యమున బ్రిటనుకంటె 20 రెట్లు యెక్కువ. భారతదేశమున వేయబడిన రైల్వే అమెరికా దేశములో వేయబడిన రైల్వేలో $\frac{1}{6}$ భాగము.

భారతదేశములో తన నావికా వ్యాపారము సున్న. సముద్రవ్యాపారములో 99% యితరదేశముల వారిది. మన దేశమునకు నావికాబలము లేనేలేదు. భారతదేశముయొక్క వ్యాపారము సన్నగిల్లి ఇతర దేశముల వ్యాపారము పెరిగి పోయినది. ఈ శతాబ్దపు ప్రారంభమున భారతదేశ వ్యాపారము కెనడా దేశపు వ్యాపారమునకు రెండంత లుండినది. జపాను వ్యాపారమునకు మూడంతలుండినది. కాని యిప్పుడు నాశన మైనది.

భారతదేశపు వ్యాపారము నశింపబడినదని ఈ దేశపు బ్యాంకులే ఋజువుచేయుచున్నవి. 1930 సం॥లో యీ దేశమున 880 బ్యాంకింగుసంస్థ లుండినవి. వీనియొక్క మూలధనము 25.45 కోట్ల రూపాయలు. వీనిలోని డిపాజిట్లు 227.66 కోట్లు రూపాయలు. 1931 సం॥మున అమెరికా దేశములో 22071 బ్యాంకు లుండినవి. వీనిలోని మూలధనము 3,541 కోట్ల రూపాయలు. వీనిలోని డిపాజిట్లు 13,788 కోట్ల రూపాయలు. 1932 సం॥లో బ్రిటిషు సామ్రాజ్యము (United kingdom) లో 12557 బ్యాంకింగుసంస్థ లుండినవి. వీనిలోని మూలధనము

316.5 కోట్ల రూపాయలు. వీనిలో డిపాజిట్లు 3226.5 కోట్ల రూపాయలు. 1930 సం॥మున జపానులో 8676 బ్యాంకింగు సంస్థ లుండినవి. వీనిలోని మూలధనము 362 కోట్ల రూపాయలు వీనిలోని డిపాజిట్లు 1929 సం॥నకు 1407.5 కోట్ల రూపాయలు.

భారతీయ వ్యాపారాభివృద్ధి, పరిశ్రమల ప్రాబల్యము ఈ దేశములోని జాయంటు స్టాకు కంపెనీల యభివృద్ధిపై నాధార పడియున్నది. 1930–31 సంవత్సరమున నీదేశమున 6,675 జాయింటు స్టాకు కంపెనీ లుండినవి. వీనిలోనుండు వసూలైన మూలధనము (Paidup capital) 271.3 కోట్ల రూపాయలు. అమెరికా దేశములో 1927 సం॥లో 475,031 జాయింటుస్టాకు కంపెనీలుండినవి. వీనిలోని వసూలు కాబడిన మూలధనము (Paidup capital) 22810 కోట్ల రూపాయలు. గ్రేటు బ్రిటనులో 1929 సం॥లో 110,139 జాయింటుస్టాకు కంపెనీ లుండినవి. వీనిలోని వసూలుకాబడిన మూలధనము (Paidup capital) 4330 కోట్ల రూపాయలు. 1931 సం॥న జపాను దేశమునందు 57,266 జాయింటు స్టాకు కంపెనీ లుండినవి. వసూలైన మూలధనము 1860 కోట్ల రూపాయలు.

ఇంతవరకు చెప్పబడిన కారణమువల్ల సర్వసౌభాగ్యవంతమగు భారతదేశము బ్రిటిషు సామ్రాజ్యతృష్ణ కెట్లు ఆహుతి కాబడినదో తెలియుచున్నది. బ్రిటిషు సామ్రాజ్యతత్వము విజృంభించి భారతదేశపు పరిశ్రమలను, వ్యాపారమును నాశన మొనర్చినది. భారతదేశమును చిరస్థాయిగా పరిపాలించు

టున్న భారతదేశ సౌభాగ్యమును దోచుకొనుటకును అను కూలమగు విధమున భారతదేశపు ఆర్థికసౌష్ఠవమును బ్రిటిషు వారు బుద్ధిపూర్వకముగా చెడగొట్టిరి. భారతదేశమున నెచ్చట చూచినను బ్రిటిషు సామ్రాజ్యతత్వము విజృంభించి చెలరేగు చున్నది. బ్రిటిషు పరిపాలనలో భారతదేశము దరిద్రదేశమైనది. తన వ్యవసాయాభివృద్ధికిని, పరిశ్రమాభివృద్ధికిని, ఆర్థికాభివృద్ధికిని ఇతరదేశములమీద నాధారపడవలసిన దైన్యస్థితి ఈదేశమునకు కలిగినది. చిన్నచిన్న జమీందారు చక్రవర్తులవల్ల దేశములో నుండు బీదలు పీడింపబడుచున్నారు. ప్రజలకు చదువురాదు. వారి గృహములు సర్వకాల సర్వావస్థలయందును దరిద్రదేవతకు నెలవు. రోగములకు పుట్టినిల్లు. ఉపవాసముల కునికిపట్టు.

# భారతదేశ పరిపాలన

బ్రిటను తన సామ్రాజ్యతత్వమున కేమాత్రముగాని యాటంకము కలుగకుండు రీతిగా భారతదేశమున తన నిరంకుశ పరిపాలన సాగించుచున్నది. ప్రభుత్వ పరిపాలనలో ప్రజల కేమాత్రమూ స్వాతంత్ర్యములేదు. జాతీయ జీవనమునకుగాని, పలుకుబడికిగాని తావులేదు. ఈదేశములో బ్రిటిషు నిరంకుశ పరిపాలన సాగించుచున్న ఉద్యోగులు బ్రిటిషు రాజకీయాధికారుల కనుసన్నల మెలగుచున్నారు. జోహారుపెట్టి యుత్తరువుల నెరవేర్చుచున్నారు. రాజ్యమునకు వెన్నెముకయైన భారతదేశపు ఆర్థికపరిపాలన యంతయు బ్రిటిషు పార్లమెంటు చేతిలోను భారతదేశమందలి వీరి యేజెంట్ల చేతులయందును నున్నది. ఈదేశపు డబ్బుపైన ఇండియాదేశపు స్టేటు సెక్రెటరీగారు సంపూర్ణాధికారము కలిగియున్నారు. ద్రవ్యము విషయములో వైస్రాయిగారికిని, గవర్నరులకును సర్వాధికారము లొసగబడినవి. ఈవిషయమునందు భారతదేశపు శాసనసభలమాట చెల్లదు. ఆర్థిక విషయములపై శాసనసభలుచేయు తీర్మానములుగాని ఒసగు నట్టి సలహాలుగాని, వైస్రాయిగారుగాని, గవర్నరులుగాని గమ నించ పనిలేదు. భారతీయ రైతునుండి నిరంకుశముగా వసూలు చేయబడు ద్రవ్యము ఈ దేశమున కేమాత్రమును నుపయోగ పడని సైన్యమునకై ఖర్చు పెట్టబడుచున్నది. భారతదేశపు జాతీయ జీవితమునకు కంటకమగు లాఆర్డరు సంరక్షణకై యా

ద్రవ్యము ఖర్చుపెట్టబడుచున్నది. దేశములో వసూలుకాబడు ముఖ్యమైన శిస్తులన్నియు కేంద్రప్రభుత్వము తన వశమునం దుంచుకొని పనికిమాలిన కొన్నిటిని రాష్ట్రప్రభుత్వముల వశము చేసినది. అందువల్ల భారతదేశమున లోటురాని రాష్ట్రప్రభుత్వ మరుదుగ నుండును.

బ్రిటిషువారిచే భారతీయులకు ప్రసాదింపబడిన ఈ ఫెడరల్ రాజ్యాంగ పద్ధతివల్ల భారతదేశపు ఆర్థిక పరిపాలన మంతయు బ్రిటిషు సామ్రాజ్యతత్వమున కనుకూలమగురీతి గావింపబడినది. ఈ చట్టము ననుసరించి భారతదేశములోని శాసనసభలకు భారతదేశపు వాణిజ్యములనుగాని, పరిశ్రమలు గాని యభివృద్ధిచేయుటకు డబ్బు నున్న. ఈ చట్టము భారతదేశ మందలి బ్రిటిషు వ్యాపారమునకున్ను, బ్రిటిషు పరిశ్రమలకున్ను సర్వవిధముల రక్షణ యొసగుచున్నది. సైన్యమునకగు ఖర్చు ఇంపీరియల్ ఉద్యోగస్తుల జీతములు య్యీఫెడరలు రాజ్యాంగ శాసనము రక్షించుచున్నది. భరింప నలవిగాని భారతజాతీయ ఋణమును నలుప్రక్కల నీచట్టము కాపాడుచున్నది. భారత జాతీయాభివృద్ధి కనుకూలించు పరిశ్రమల నభివృద్ధి చేయుటకు రాష్ట్రప్రభుత్వముల చేతులలో డబ్బులేకుండు రీతిగా యీ చట్టము శాసించుచున్నది. ఈ ఫెడరలు రాజ్యాంగ శాసనమునం దెచ్చట చూచినను భారతదేశపు ఆర్థిక దాస్యపు శాశ్వతములగు చిహ్నములు కనబడుచున్నవిగాని వేరుకాదు.

ఈ చట్టము ననుసరించి భారతదేశమునందలి బ్రిటిషు

సామ్రాజ్య సిద్ధాంతపు లాభములు మూడుపకములుగా గమనింప వలసియున్నది. (1) భారతదేశపు వ్యాపారముపైన భారతదేశపు ప్రభుత్వమునకుండు అధికారమెంత (2) భారతజాతికి తమదేశ పరంబడిపైననుండు అధికారమెంత. (3) రాష్ట్రప్రభుత్వములకు వాస్తవముగా యొసగబడిన ఆర్థిక స్వపరిపాలన మెంత.

వ్యాపార స్వాతంత్ర్యమనగా భారతదేశము తన వ్యాపారాభివృద్ధి కనుకూలించు శాసనములు కావించుకొనుట. వ్యాపారాభివృద్ధి కనుకూలమగురీతి ఇతర దేశములతో సంప్రతించి వలయురీతి యొడంబడికలు గావించుకొనుట. ఈ రెండు సదుపాయము లీచట్టమువల్ల భారతదేశమున కొసగబడినవా ?

1919 సం॥రపు సంస్కరణములు రాకముందు భారతదేశపు వ్యాపారవిషయమై స్టేటు సెక్రెటరీగారు చెప్పినరీతి ఇండియా గవర్నమెంటువారు నడచుకొనుచుండిరి. ఈష్టు ఇండియా కంపెనీ పరిపాలన మొదటిరోజులలో ఈ కంపెనీ అప్పుల విషయములోను లాభముల పంపకములోను పార్లమెంటువారు చట్టము గావించి యీ కంపెనీవారి లెక్కలను తనిఖీచేయుటకై 'బ్రిటిషు ఖజానా' (British Treasury) కు పంపుకోవలసినదిగా ఉత్తరువు గావించియుండిరి. 1784 సం॥నకు తరువాత ఈష్టుఇండియా కంపెనీ భారతదేశములోని వ్యవహారములు 'బోర్డు ఆఫ్ కంట్రోలు' (Board of control) వారి పరిశీలన క్రింద నుండినవి. ఈబోర్డు అధ్యక్షుడు భారతదేశమునకు సంబంధించిన ప్రతివిషయమునందును సంపూర్ణాధికారము వహించి

యుండెను. 1857 సం॥లో భారతదేశ పరిపాలన కంపెనీవారి నుండి చక్రివ_ర్తి (crown) చేతికి వచ్చినది. 'బోర్డు ఆఫ్ కంట్రోలు' అధ్యక్షునకు బదులుగా ఇండియాదేశపు స్టేటు సెక్రిటరీగా గారేర్పడిరి. పార్లమెంటువారు ఈ కార్యదర్శిగారికి భారత దేశములో శిస్తులు (Revenues) వసూలుచేయుటకును, ఈ శిస్తులను తన యిచ్చవచ్చినరీతి తనికీచేయుటకును, నడుపుటకును (Superintend, Direct, and control) వసూలైన శిస్తును తన స్వాధీనమునం దుంచుకొనుటకును అధికారమిచ్చిరి. ఈ విషయమై యితడు పార్లమెంటువారికి జవాబుదారీగా నుండవలసి నదిగా నిర్ధరింపబడినది. 'మంటాగో ఛెమ్సుఫర్డు' సంస్కర ణములు వచ్చువరకు పైయధికారము ఇండియాదేశపు స్టేటు సెక్రెటరీగారి చేతిలోనేయుండినది. సైమను సంఘమువా రీ విష యమై ఈక్రిందిరీతి చెప్పిరి: "భారతదేశ పరిపాలనకై గవర్నరు జనరలుగారు తాను ఖర్చుపెట్టు మొత్తములకు స్టేటుసెక్రిటరీగారి యనుమతి ముందుగా పొందవలయును. ఈ స్టేటు సెక్రెటరీ గారు తనయొక్క తీర్మానమును ("Resolution") పదేపదే మార్చుచుండెడివాడు. ఇందుకై ఇండియా గవర్నమెంటువారు రాష్ట్రప్రభుత్వములు వసూలుచేయవలసిన శిస్తులను అనేక నిబం ధనలచే తమవశమం దుంచుకొనిరి. ఇండియా గవర్నమెంటు వారుగాని, రాష్ట్ర గవర్నమెంటువారుగాని శిస్తులు విధించుటకు ముందు స్టేటుసెక్రెటరీగారి యనుమతి పొందవలయును. అప్పు చేయవలసినచో నతనిమాట కావలయును. 1920 వ సం॥ వరకు

భారతదేశపు ఆదాయవ్యయపట్టిక (Budget) లో భారతదేశ పరిపాలనా ఖర్చులేగాక స్టేటుసెక్రెటరీగా రనుమతించిన కర్చులు కూడా చేర్చబడుచుండెడివి. ఇట్లుచేర్చిన తరువాతనే ఆదాయ వ్యయపట్టికను శాసనసభలో ప్రవేశపెట్టవలసినదిగా నుండినది."

1919 సంవత్సరపు సంస్కరణములు ప్రసాదింప బడిన తరువాత యీపద్ధతి మారడముగాని, స్టేటుసెక్రెటరీగారి యధికారము తగ్గుటగాని జరుగలేదు. 1919 సం॥లో ఇండియా గవర్నమెంటు బిల్లును (Government of India Bill of 1919) పరిశీలించి అందుపైన జాయింటు సెలెక్టుకమిటీవారీక్రింది యభి ప్రాయమిచ్చినారు.

"భారతదేశమునకును, బ్రిటనునకును మధ్యగల పరస్పర విశ్వాసమునకు భారతదేశపు వ్యాపారము బ్రిటిషువారి లాభములకై 'వైటుహాలు'నుండి నడుపబడుటవల్ల భంగము కలుగుచున్నది. ప్రస్తుతము బ్రిటిషువారికి కొంతయనుమాన ముండుట సహజము. భారతదేశము తన వ్యాపారాభివృద్ధికి తగినరీతి శాసనములు గావించుకొనుటకు స్వాతంత్ర్య మొసగ వలయును. పార్లమెంటువారి కిప్పుడు భారతదేశ పరిపాలనలో నుండు నధికారము తగ్గినగాని యీపనికాదు. ప్రస్తుతము చక్రవర్తిగారి 'వీటో' యధికార మంతరించినగాని యీపని సాధ్యపడదు. ఈ సంస్కరణచట్టములో నెచ్చటగాని ఈ యధి కారములు తగ్గించు సూచనలు కనబడవు. ఇట్టి విషయములో భారతదేశమునకును, బ్రిటనుకును మధ్య విశ్వాసమును, నమ్మ

కమును ఆవశ్యకము. బ్రిటిషు సామ్రాజ్యములోని ఆస్ట్రేలియా న్యూజీలాండు, కెనడా, దక్షిణాఫ్రిక, ఈ రాజ్యములవలె భారతదేశమునకుకూడా తన వ్యాపారవిషయములందు తన ప్రజలకున్ను, తన పరిశ్రమలకున్ను లాభమగు విధమున వ్యాపార చట్టములు గావించుకొనుట కధికార మత్యవసరము. ఇండియా గవర్నమెంటువారున్ను శాసనసభయు యిష్టపడి చేయునట్టి వ్యాపారచట్టములకు స్టేటుసెక్రెటరీగా రడ్డము రాగూడదు. బ్రిటిషు సామ్రాజ్యమంతటికి సంబంధించిన విషయములో స్టేటు సెక్రెటరీగారు కొంత యడ్డపడవచ్చునుగాని ఈ యడ్డపడు విషయములోకూడా కొంత హద్దుండవలయును"

జాయింటు సెలెక్టుకమిటీవారి యీ సూచనవల్ల భారతదేశమునకున్ను బ్రిటనుకున్ను మధ్య పూర్వముండిన వ్యాపార పద్ధతిలో కొంతమార్పు వచ్చినది. సంస్కరణములను ప్రసాదించినవారు భారతజాతికి సంపూర్ణస్వాతంత్ర్య మిచ్చినామని చెప్పి 'స్వాతంత్ర్యపరిషత్తు' (Fiscal Autonomy Convention) నొకదాని నేర్పరచిరి.

1930 సం॥న సర్ జార్జిరెయినీగారు ఇండియా గవర్నమెంటు పరముగ మాటలాడుచు యీ 'స్వాతంత్ర్యపరిషత్తు' విషయమై యిట్లుచెప్పిరి. "భారతశాసనసభలో తీర్మానములను ప్రవేశపెట్టుటకు ముందు ఇండియా గవర్నమెంటువారు స్టేటు సెక్రెటరీగారి సలహాతీసికొని అందుపైన నడచుకొనవలసిన విధా

నమును తామే నిర్ధరించుకొనుచుండిరి. 'స్వాతంత్ర్యపరిషత్తు' (Fiscal Autonomy Convention) యేర్పడిన తరువాత ఇండియా గవర్నమెంటుకు డొమినియన్ హోదా యివ్వబడినది. ఇందుకై ఇండియా గవర్నమెంటువారు భారతశాసనసభలో ప్రవేశ పెట్టదలచిన యంశములను వారే నిర్ధరించుకొనవచ్చును. భారత శాసనసభ మాటపైన రెండు పరిస్థితు లేర్పడవచ్చును. శాసనసభయు, ఇండియా గవర్నమెంటువారును యేకీభవించినచో తీర్మానము నెగ్గును. అప్పటికి ఇండియా దేశమునకు అధినివేశ స్వాతంత్ర్య మబ్బినట్టే. ఇండియా గవర్నమెంటువారును శాసనసభయు నేకీభవించినచో వ్యవహారము తలక్రిందలగును. ఇట్టి పరిస్థితులేర్పడినపుడు ఇండియా గవర్నమెంటువారు స్టేటు సెక్రెటరీగారివద్దకు పోవలసినదేకాని యీ 'స్వాతంత్ర్యపరిషత్తు' పనిచేయలేదు."

ఇట్టి బూటకపు పరిషత్తులవల్ల భారతదేశమున కేమి లాభమో తెలియదు. ఈ 'స్వాతంత్ర్యపరిషత్తు' పార్లమెంటు వారు చట్టముచేసి యేర్పరచినదిగాదు. 1919 సం॥రపు సంస్కరణములపైన జాయింటు సెలెక్టుకమిటీవారు సూచించిన సలహాల ననుసరింపవలసిన యొకపద్ధతిగా యేర్పడినది. ఈ పరిషత్తు పార్లమెంటువారికి సలహాదారుగాగాని, భారతదేశమునకు సహాయకారిగాగాని లేదు. ప్రసాదింపబడిన సంస్కరణములే భారతశాసనసభకు వ్యాపారవిషయమై శాసనములుచేయు నధికార మివ్వలేదు. ఈ సంస్కరణముల ననుసరించి గవర్నరు

జనరలుగారికి బ్రిటిషు వ్యాపారమును కాపాడుటకును, మరి యనేకవిషయములలోను సర్వాధికార మొసగబడినది. ఈసంస్కరణములవల్ల స్టేటు సెక్రెటరీగారికుండు భారతదేశపు ఆర్థిక పరిపాలనలోని పైచేయి తగ్గలేదు. "స్టేటు సెక్రెటరీగారికి కేంద్రప్రభుత్వ ఆర్థికపరిపాలనపైన నున్నంత యధికారము మరేశాఖపైనను లేదు. అతని చర్యలు భారతప్రభుత్వమునకే సరిపడలేదు. కొన్నిసందర్భములయందు ఇండియా గవర్నమెంటు హిందూదేశమునందుండు బ్రిటిషు ఏజంటుగా ప్రవర్తింపవలసి వచ్చిన"దని సైమనుసంఘమువారు చెప్పినారు.

స్వాతంత్ర్యపరిషత్తువల్ల భారతశాసనసభకు యేవిధమగు స్వాతంత్ర్యమూ లభించలేదు. కాని కొందరు ఈ పరిషత్తువల్ల ఇండియా బ్రిటనులమధ్య వ్యాపారవిషయములో కొంత న్యాయమేర్పడినదని చెప్పుచున్నారు. ఇందు కుదాహరణముగా వ్యాపారసుంకముల హెచ్చింపున్ను, ఒకటి రెండు భారతదేశపు పరిశ్రమల కొసగబడిన రక్షణయున్ను చూపుచున్నారు. ఐతే ఇండియా గవర్నమెంటువారు తమకు డబ్బులేని సమయమున ద్రవ్యసంపాదనకై వారు వేసిన యెత్తని మరచినారు. భారత శాసనసభలమాట తన కనుకూలించని సమయమున ఇండియా గవర్నమెంటు తన యిచ్చవచ్చినరీతి మెలగుచున్నది. 'ఇండో బ్రిటిషు అగ్రిమెంటు' విషయములో భారతశాసనసభ మాట మంటగలిపి ఇండియా గవర్నమెంటువారు పైయొడంబడికకు ఒప్పుకొనిరి. 1934 సం॥లో వ్యాపారవిషయమై ఇండియా,

జపాను దేశముల మధ్య యేర్పడిన వ్యాపార ఒడంబడికకు లండను నగరమునందు సంతకముపెట్టిరి. వ్యాపారవిషయము లలో కొన్ని సుంకములు హెచ్చించినను, తక్కిన వ్యాపార పరిపాలన మంతయు బ్రిటిషు సామ్రాజ్య వ్యాపారాభివృద్ధి కను కూలముగా నడుపబడుచున్నది. 1919 సం॥రపు సంస్కరణ ముల వల్లగాని, 'స్వాతంత్ర్యపరిషత్తు' వల్లగాని భారతదేశము నకు వ్యాపార స్వాతంత్ర్య మేమాత్రమూ లభించలేదని చెప్ప వలయును.

ఇప్పుడు ప్రసాదింపబడిన యీ ఫెడరల్ రాజ్యాంగ విధానములో భారతదేశమునకు వ్యాపార స్వాతంత్ర్య మెంత యొసగబడినదో జాయింటు పార్లమెంటరీ సంఘమువారు 'శ్వేతపత్రము' (white paper) పరిశీలించుచు నిట్లుచెప్పినారు.

"భారతదేశమునకును, బ్రిటిషు సామ్రాజ్యమునకును మధ్యగల వ్యాపారము గడచిన పదుమూడు సంవత్సరములనుండి 1919 సం॥రపు ఇండియా బిల్లుపైన 'వ్యాపారశుల్క పరిషత్తు' వారు గావించిన శిపార్సులపైన నడచుచుండినది. ఈ క్రొత్త ఫెడరల్ రాజ్యాంగవిధానచట్ట మమలులోనికి వచ్చినవెంటనే 'ఈ వ్యాపారశుల్క పరిషత్తు' (fiscal convention) రద్దగు చున్నది."

" ఈ రాజ్యాంగ పద్ధతిలో భారతశాసనసభ బ్రిటిషు సామ్రాజ్య వ్యాపారము నరికట్టుటకు కావలసిన శుల్కములను

బ్రిటిషు సరకులపైన విధించునేమోనని కొందరు భయపడుచున్నారు. కాని ఈ రాజ్యాంగచట్టముద్వారా గవర్నరు జనరల్ గారికి భారతదేశ వ్యాపారవిషయమై సర్వస్వాతంత్ర్యమున్నది. శుల్కముల నిర్ణయించుటలోను, వానిని విధించుటలోను బ్రిటిషు సామ్రాజ్యమునకును, భారతదేశమునకును గల వ్యాపార మెట్టిసిద్ధాంతములపైన నడుపబడవలయునో అట్టి సిద్ధాంతముల నేర్పరచుటకును కావలసిన యధికారములను గవర్నరు జనరలుగారికి 'ఇన్‌స్ట్రుమెంటు ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్' ద్వారా యొసగబడినది. గవర్నరు జనరలుగారు భారతదేశ విషయమై తన స్వంత బాధ్యత నెరవేర్చుటకు ఈ క్రింది యధికారము లాతని కొసగవలయునని యీ సంఘమువారు సిఫార్సు చేయుచున్నారు. బ్రిటిషు సామ్రాజ్యమునుండి ఇండియాకు దిగుమతికాబడు సరకులపైన శుల్కములు విధించు తీర్మానములుగాని లేక అట్టిపద్ధతులుగాని ఆపుదలచేయుటకు గవర్నరుజనరలుగారి కధికారముండవలయును. బ్రిటిషుసామ్రాజ్యపు సరకులకును, ఇండియా సరకులకును తారతమ్యముండరాదు. అట్టి తారతమ్య మమలులో పెట్టుటకుగాను చేయబడునట్టి చట్టములుగాని, విధింపబడు సుంకములుగాని బ్రిటిషు సామ్రాజ్య వ్యాపారమున కాటంకములని గవర్నరు జనరలుగా రభిప్రాయబడిన తక్షణమే వాని నాపుదల చేయుట కతని కధికారముండవలయును."

భారతదేశములోని బ్రిటిషు వ్యాపారమునకున్ను, వ్యాపార స్వాతంత్ర్యమునకున్ను ఫెడరల్ రాజ్యాంగవిధానము

వల్ల ముప్పువాటిల్లునేమోనని భయపడి ఈక్రింది సిఫార్సులను పార్లమెంటరీ సంఘమువారు చేసినారు. "భారతదేశ రాజ్యాంగ చట్టమునం దీక్రింది నియమము లుండవలయును, (1) బ్రిటిషు సామ్రాజ్యములో నివసించువారు భారతదేశమునకు వచ్చుటకుగాని. పోవుటకుగాని భారతదేశమున నివసించుటకుగాని, ఆస్తులను సంపాదించుటకుగాని, ఉద్యోగములు చేయుటకుగాని తమ యిష్టమైన వ్యాపారముల చేయుటకుగాని యాటంకముండరాదు. అట్టి యాటంకము కలిగించు చట్టములను భారతశాసనసభలో ప్రవేశపెట్టినయెడల నట్టిచట్టములను గవర్నరు జనరలు తన స్వంత బాధ్యత నెరవేర్చుటకై యాపుదల చేయవచ్చును. (2) బ్రిటిషు సామ్రాజ్యమందుండు వర్తక కంపెనీల వ్యాపారము భారతదేశములో నాటంకపరుపబడరాదు. (3) బ్రిటిషు నావికా వ్యాపారమున కేవిధమైన యాటంకముగాని, యడ్డుగాని యుండరాదు. ఈ పై రెండు సిద్ధాంతముల నెరవేర్చుటకుగాను గవర్నరులకున్ను, గవర్నరు జనరలుకున్ను ఈక్రింది యధికారము లుండవలయును. భారతశాసనసభవారిచే ప్రవేశపెట్టబడునట్టి బిల్లువల్ల బ్రిటిషు సామ్రాజ్య వ్యాపారమునకుగాని, నావికా స్వాతంత్ర్యమునకుగాని యాటంకము కలుగునని, గవర్నరులుగాని, గవర్నరు జనరలుగాని అభిప్రాయపడినచో నట్టిబిల్లును ప్రవేశపెట్టుటకు అనుమతి నొసగుటకుగాని, లేదనుటకుగాని గవర్నరులకున్ను, గవర్నరుజనరలుకున్ను అధికారము లుండవలయును."

భారతదేశమునకు యీ క్రొత్తరాజ్యాంగ చట్టము ప్రసాదింపబడినతోడనే యిదివరకుండిన 'స్వాతంత్ర్య పరిషత్తు'

(Fiscal Autonomy convention) అంతమొందినది. భారతీయ వ్యాపార స్వాతంత్ర్యరక్షణకుగాను భారత శాసనసభ చేయునట్టి ప్రతిచట్టమును అరికట్టుటకు వలయు నాటంకములు కల్పింపబడినవి. ఇందుకు బదులు బ్రిటిషు వ్యాపారమునకు రక్షణ యొసగబడినది. ఈరక్షణలు రెండువిధములు (1)భారతదేశమునకు దిగుమతికాబడు బ్రిటిషు సరకులకున్ను, యితర సరకులకున్ను వ్యాపారవిషయములందు భేద మేమాత్రము నుండకూడదు. (2) భారతదేశమునందుండు బ్రిటిషు వ్యాపారస్తులకున్ను, వ్యాపార సంస్థలకున్ను, భారతీయ వ్యాపారస్తులకున్ను వ్యాపార సంస్థలకున్ను యేమాత్రముగాని హెచ్చుతగ్గు లుండరాదు.

పార్లమెంటరీ సంఘమువారు వ్యాపారవిషయములోని హెచ్చుతక్కువలు (Discriminations) రెండు విధములుగ నుండునని యూహించినారు. చట్టరూపమునగాని, పరిపాలన రీతిగాగాని హెచ్చుతక్కువలు కల్పించవచ్చును. వ్యాపారవిషయములో హెచ్చుతక్కువలు కల్పించు చట్టములను చేయనిదే పరిపాలనలో హెచ్చుతక్కువలు కల్పించు టసాధ్యము. అందువల్ల ఈ ఫెడరల్ రాజ్యాంగపద్ధతిలో నట్టి హెచ్చుతక్కువలు కల్పింపపూనిన చట్టములను ప్రతిఘటించుటకు వలయు నధికారములను గవర్నర్లకున్ను, గవర్నరు జనరలుకున్ను ఒసగబడినవి.

ఈ క్రొత్తరాజ్యాంగ చట్టము ననుసరించి భారతదేశములో గవర్నరులకున్ను, గవర్నరు జనరలుకున్ను వ్యాపార

విషయమున నెంతయధికార మున్నదో కనుగొందుము. ఇండియా గవర్నమెంటు చట్టము 12 సెక్షన్‌లో భారతదేశము నకు దిగుమతి కాబడు బ్రిటిషు సరకుల కేమాత్రముగాని హెచ్చుతక్కువలు కల్పింపబూనునట్టి చట్టములుగాని, అధికార ములుగాని ప్రతిఘటించుటకు గవర్నర్లకున్ను గవర్నరు జనరలు కున్ను అధికార మివ్వబడినది. గవర్నరు జనరలుగారు భారత దేశమునకు దిగుమతికాబడు బ్రిటిషు సామ్రాజ్య సరకులపైన ఇండియా గవర్నమెంటువారు ప్రత్యేక సుంకములు వేయుటగాని, లేక యీ సరకులకు యితర సరకులకు హెచ్చుతక్కువలు కల్పించుటగాని లేకుండా చూడవలయును. 12 (2) సెక్షన్ మేరకు గవర్నరు జనరలుగారు తన స్వంతబాధ్యత నెరవేర్చుటకు గాను యితరుల సహాయముగాని, సలహాగాని కోరకుండనే తనకు తోచినరీతి న్యాయమని తెలిసినరీతి ప్రవర్తించవచ్చును. 9వ సెక్షన్ ననుసరించి గవర్నరు జనరలుగారు తనకు న్యాయమని తోచిన రీతిగా ప్రవర్తించిన విషయమై ప్రశ్నించుటకున్ను, అత డీరీతిగా చేయవలసినదని సలహానిచ్చుటకున్ను, అత డనుసరించిన విధా నము న్యాయవిరుద్ధమని పలుకుటకున్ను భారతశాసనసభ కధికా రములేదు. అతనిమాటయే కడపటి మాట. అతని సిద్ధాంతమే కడపటి సిద్ధాంతము. సెక్షన్ 14 (1) ననుసరించి గవర్నరు జనరలుగారు తన ప్రవర్తనకు స్టేటు సెక్రెటరీగారికి జవాబు దారీగా నుండవలయును.

జాయింటు పార్లమెంటరీ సంఘమువారు, ఇండియా గవర్నమెంటువారు వర్తక సుంకములు విధించు విధానముపైన

గవర్నరు జనరలుగారి క్రింది యధికారము ఉండవలయునని సిఫార్సు చేసినారు. (1) దిగుమతులపైన ప్రత్యేక సుంకములు విధించుట. (2) వస్తువుల విషయమై హెచ్చుతక్కువలు కల్పించుట. (3) దిగుమతుల బహిష్కరించు సుంకములు వేయుట. (4) హెచ్చుతక్కువలు కల్పించునట్టి శాసనములు చేయుట. ఈ పనులను ఇండియా గవర్నమెంటువారు చేసినప్పుడు వీనిని కాదనుటకు వలయు అధికారములు గవర్నరుజనరలుగారి కుండవలయును.

గవర్నరుజనరలుగారి కుండు యీ ప్రత్యేక అధికార పరంపరవల్ల భారతశాసనసభవారు భారతదేశపు వ్యాపారమును వృద్ధిచేయుటకును, భారతదేశపు పరిశ్రమల రక్షించుటకును సాధ్యపడదు. అందుకై సుంకముల విధింపరాదు. భారత దేశము గ్రేటుబ్రిటనుకంటె ఇతరదేశముల కెక్కువ ఎగుమతి చేయుచున్నది. భారతదేశము బ్రిటిషు వస్తువులకు ప్రత్యేకత యిచ్చియుండుటవల్ల వ్యాపారవిషయమై యితర దేశములతో ఒడంబడికలు గావించుకొనుట కధికారములేదు.

1919 సం॥రపు సంస్కరణములకంటె నీ ఫెడరల్ రాజ్యాంగచట్టము భారతదేశపు వ్యాపార స్వాతంత్ర్యమునకు పలు విధములైన యాటంకముల కల్పించి నాశనము చేయుచున్నది. ఇదిగాక ఇండియా దేశము బ్రిటిషు సరకులకు ప్రత్యేకత నొసంగుటవల్ల భారతీయ వ్యాపారమున్ను ప్రజలును పూర్తిగా కష్ట

నష్టములు పడవలయును. భారతీయ పరిశ్రమ లిప్పుడనుభవించు రక్షణనుకూడా ఈ ఫెడరల్ రాజ్యాంగచట్టము హరించుచున్నది. ఈ చట్టములోని 111, 118 సెక్షనులు ఇండియాదేశమందిలి బ్రిటిషు వ్యాపారమునకున్ను, వ్యాపార కంపెనీలకున్ను సంపూర్ణరక్షణ నొసగుచున్నవి.

111 (a) సెక్షన్ ననుసరించి బ్రిటిషు సామ్రాజ్యము నందుండువా రెంతమందిగాని ఈ దేశమునకు వలసరావచ్చును. అట్టివారిని రాకుండ జేయుటకు ఫెడరల్ శాసనసభకుగాని, రాష్ట్ర శాసనసభలకుగాని యధికారములేదు. (b) బ్రిటిషు సామ్రాజ్య మందుండువా రీదేశమం దాస్తులు సంపాదించుటకును, తమ యిష్టమువచ్చినప్పు డమ్ముటకును, ఎట్టి వృత్తిగాని అవలంబిం చుటకును, వ్యాపారము చేయుటకును ఆటంకములు కల్పించు అధికారము ఇండియా గవర్నమెంటువారికి లేదు.

పై విషయములబట్టి చూచినచో భారతదేశపు ఆర్థిక జీవితముపైన సంపూర్ణాధికారము చలాయించుచున్న యితర దేశస్థులను తప్పించుటకు సాధ్యముకాదు. భారతదేశమునందలి పెద్దపెద్ద ఉద్యోగములందుండు వారిని బ్రిటిషు కర్మాగార చక్రవర్తులును, వ్యాపార కుబేరులునునగు బ్రిటిషువారిని మాటా డించుటకు భారతదేశమున కధికారములేదు. ఇట్టి హోదాలు గలవారు భారతీయులు బ్రిటిషు సామ్రాజ్యమునందు చాలతక్కువ. కాబట్టి బ్రిటిషు సామ్రాజ్యమునందు భారతీయుల కొసగబడిన

రక్షణములు బూటకములు. భారతజాతి యెప్పటికిని బ్రిటిషువారి క్రింద నణగియుండవలసినదేకాని వేరులేదు.

భారతదేశమందుండు బ్రిటిషు కంపెనీలపైన ఫెడరలు శాసనసభకుగాని, రాష్ట్ర సభలకుగాని యేమాత్ర మధికారమును లేదు. 113 సెక్షన్ ప్రకారము భారతదేశమున బ్రిటిషు సామ్రాజ్యచట్టముల మేరకు స్థాపింపబడిన కంపెనీలయొక్క గవర్నింగుబాడీల విషయమైగాని, వాటాల విషయమైగాని, బాండుల విషయమైగాని, ఉద్యోగస్తుల విషయమైగానీ, ఏజంట్ల విషయమైగాని, కడకు నౌకర్ల విషయమైగాని, మరి పెక్కు విషయములపైన ఫెడరల్ శాసనసభ చేయునట్టి 'ఇండియన్ కంపెనీ లా' వర్తించదు. బ్రిటిషు కంపెనీలను ఇండియన్ కంపెనీ లా క్రింద రిజిష్టరు కావలసినదని శాసించుటకుగాని, బ్రిటిషు కంపెనీలయొక్క రిజిష్టర్డు కార్యాలయ మెచ్చటనుండవలయునని నిర్ధరించుటకుగాని, కంపెనీలయొక్క లేవాదేవీలో యిట్టి కరెన్సీనే యుండవలయునని చెప్పుటకుగాని, కంపెనీ యధికారులీజాతివారే యుండవలయునని కోరుటకుగాని, అట్టి వారి నివాసస్థలము నిర్ధరించుటకుగాని, గవర్నింగు బాడీలయొక్క సంఖ్య యేర్పరచుటకుగాని, వాటాదారులపైగాని, డిబెన్చర్సుపైన గాని భారతదేశపు ఫెడరల్ శాసనసభకు అధికారములేదు. ఇండియను కంపెనీలకున్ను, బ్రిటిషు కంపెనీలకున్ను, భారత ఫెడరలు శాసనసభగాని, రాష్ట్ర సభలుగాని చేయునట్టి సహాయ్య మునం దెచ్చుతక్కువ లుండకూడదు. ఇందుకు మారుగా

బ్రిటిషు సామ్రాజ్యమందుండు ఇండియను కంపెనీలకు ఈ విధ మైన సౌకర్యములే బ్రిటిషు సామ్రాజ్యమునం దొసగవలయును. ఎంతవరకైతే బ్రిటిషు సామ్రాజ్యములో ఇండియా కంపెనీలకు సౌకర్యములు లభించునో యంతవరకే బ్రిటిషు కంపెనీలకు ఇండియా గవర్నమెంటువారు సాయపడవచ్చునను విషయమొకటి యున్నది. 112వ శెక్షన సుంకములు విధించుటలో ఫెడరల్ గవర్నమెంటువారు ఇండియను కంపెనీలకున్ను, బ్రిటిషు కంపె నీలకున్ను వ్యత్యాసము చూపకూడదని శాసించుచున్నది. 116వ శెక్షను ననుసరించి గ్రేటుబ్రిటనునందు స్థాపింపబడి ఇండియాలో వర్తకము చేసుకొనుచున్న కంపెనీలు తమ వర్తకమున్ను, పరిశ్ర మలున్ను వృద్ధిచేసుకొనుటకుగాను ఈ యభివృద్ధికై! ఇండియను కంపెనీలకిచ్చే ధనసహాయమే ఇండియాయం దుండు బ్రిటిషు కంపెనీల కీయవలయును. ఇట్టి సౌకర్యమునే గ్రేటుబ్రిటనునం దుండు ఇండియను కంపెనీల కొసగవలసినదని నిర్ధరింపబడినది.

భారతదేశముయొక్క ఆర్థిక జీవితముపై బ్రిటిషువారి పెట్టుబడిధనమున కెంతయధికార ముండునది యిదివరకే చెప్పి యుంటిమి 1922–23 సం॥లో భారతదేశమందు 720 పరదేశ కంపెనీలు 487 మిలియను పౌనుల పెట్టుబడి ధనముతో వ్యవహా రములు జరుపుచుండినవి. 1931–32 సం॥న కీ కంపెనీలు 911 అయినవి. వీనిలోని పెట్టుబడి ధనము 756 మిలియను పౌనులైనది. ఈక్రింది కంపెనీ లట్టి పరదేశ కంపెనీలలో చాల ముఖ్యమైనవి.

| కంపెనీ పేరు | సంఖ్య | వసూలుకాబడిన మూలధనము (మిలియను పౌనులలో) |
| --- | --- | --- |
| 1. బ్యాంకింగు మరియు అప్పులిచ్చునవి | 29 | 99.3 |
| 2. ఇన్సూరెన్సు | 143 | 80.4 |
| 3. నావికావ్యాపార కంపెనీలు | 18 | 41.3 |
| 4. రైల్వే, ట్రామ్వే కంపెనీలు | 18 | 24.8 |
| 5. వ్యాపారముచేయునట్టియు వస్తువుల తయారుచేయు నట్టియు కంపెనీలు | 359 | 309.8 |
| 6. తేయాకు కంపెనీలు | 180 | 28.2 |
| 7. గనులకంపెనీలు (బంగారుకాక) | 34 | 113.4 |
| 8. జనుపనార కంపెనీలు | 5 | 2.8 |

ఇట్టి కంపెనీలద్వారా భారతదేశమునుండి యేటేట లెక్కలేనంత ధనము బ్రిటను చేరుచున్నది. ఈ కంపెనీలు తమ యొక్క యావచ్ఛక్తిని వినియోగించి భారతదేశపు వ్యాపారము నంతయు బ్రిటిషువారి చేతులయందుంచుచున్నవి. భారతదేశమం దుండు బ్రిటిషు బ్యాంకులు భారతీయ వర్తకమునకు సాయపడక పోవడమేకాక భారతీయులను చాలహేయముగను నీచముగను చూచుచున్నవి. బాల్యావస్థయందుండు భారతీయ పరిశ్రమలున్ను

వ్యాపార సంఘములున్ను. ఈ బ్రిటిషు బ్యాంకుల పోటీకి తాళ జాలక కృశించి, నశించిపోవుచున్నవి. భారతదేశపు పరిశ్రమలు వృద్ధికావలెనన్న బ్రిటిషువారి పోటీ తప్పవలెను. అట్టి రక్షణ యొసగుట యీ ఫెడరలు రాజ్యాంగపద్ధతికి విరుద్ధము. బ్రిటిషు కంపెనీలు ఇండియను కంపెనీ లా క్రింద పరిపాలింపబడనందున అట్టి కంపెనీలపై నాధారపడియుండు భారతీయులకు బ్రిటిషు కంపెనీల ఆర్థికస్థితిగాని, వాటియొక్క లేవాదేవీలుగాని తెలియక పోవుటవల్ల అట్టికంపెనీలు హఠాత్తుగా మూయబడినప్పుడు తెలియనంత నష్టపడవలసివచ్చును. ఆదాయపు పన్ను విధించుటలో బ్రిటిషు బ్యాంకులకున్ను, ఇండియా బ్యాంకులకున్ను హెచ్చు తక్కువ లుండకూడదనుటవల్ల భారత ఖజానా నష్టపడవలసి వచ్చును. గ్రాంటులు, బౌంటీలు, సబ్‌సిడీలు యిచ్చుటలో బ్రిటిషు కంపెనీలకున్ను, భారతీయ కంపెనీలకున్ను భేదముండ రాదనుటవల్ల భారతీయ రైతు తానిచ్చు శిస్తుతో పరదేశ వ్యాపార సంస్థలను పోషింపవలసినవాడగుచున్నాడు.

పరదేశపు పెట్టుబడిని విచారించుట కేర్పడిన సంఘమువారు ఇతరదేశములనుండి భారతదేశమునకు ప్రవహించు పెట్టుబడి ధనము నాపవలెనన్న భారతీయ పెట్టుబడిని వృద్ధి చేయవలయునని చెప్పినారు. అట్టివృద్ధి యీ ఫెడరలు విధానమునం దేమాత్రమూ సాధ్యపడదు. ప్రపంచ యుద్ధానంతరము బ్రిటిషువారి పెట్టుబడి ధనము భారతదేశమున కెక్కువ రాజొచ్చినది. పరదేశ కంపెనీలు 55% పెరిగినవి. ఫెడరలు రాజ్యాంగ

పద్ధతిలో నిట్టికంపెనీ లెక్కనుగాని తగ్గవు. పరదేశ పరిశ్రమలు కూడా నానాటికి పెరిగిపోవును. బ్రిటిషు సామ్రాజ్యములో భారతీయ కంపెనీలు చాలతక్కువ. లేనేలేవని చెప్పినను చెప్పవచ్చును. కాబట్టి యిట్టి భారతీయ కంపెనీలకు, భారత ప్రభుత్వము యితర కంపెనీలపట్ల జూపునంత విశ్వాసము తమకు బ్రిటిషు సామ్రాజ్యములో దొరకుననుమాట కల్ల. భారతీయ వర్తకసంఘము (Indian Chamber of commerce) వారి లెక్కలుబట్టి 1934 సం॥లో బ్రిటిషు సామ్రాజ్యమంతటిలోను భారతీయ వ్యాపార సంస్థలు 42. అందులో 10 ఎగుమతి దిగుమతులుచేయు సంస్థలు. 5 ఎగుమతులు మాత్రమేచేయునవి. 5 ఓరియంటల్ ఆర్టువేరు సంస్థలు, 3 భోజనశాలలు (Resteaurants), 2 తిండిసామానులు తయారుచేయునవి. 4 ముత్యాలవ్యాపార సంస్థలు. 1 జంబకానాలునేయు సంస్థ. 1 పొగాకు దిగుమతిచేయు సంస్థ. ఈ పైసంస్థ లికముందు వృద్ధికావడము తక్కువ. బ్రిటిషు సంస్థలతో పోటీచేసి వృద్ధికావడము మరీ తక్కువ. అందువల్ల భారతీయ సంస్థలకు బ్రిటిషు సామ్రాజ్యములో నేవో సౌకర్యము లొసగబడినవను మిషతో బ్రిటిషు సంస్థలకు భారతదేశమున అందుకు బదులుగా సౌకర్యములు కల్పించుకొనుట అన్యాయము. ఇందువల్ల బ్రిటిషు ప్రజలకు లాభమే గాని భారతీయ సంస్థలకు లేదు. ఇంతేకాక భారతదేశపు వాణిజ్యమున్ను, పరిశ్రమలున్ను యభివృద్ధిమార్గముతప్పి పూర్తిగా నష్టపడును.

భారతదేశమునందలి బ్రిటిషు నావలున్ను, నావికా వ్యాపారమున్ను ఫెడరల్ చట్టపు 115 సెక్షనువల్ల రక్షింపబడు చున్నవి. బ్రిటిషు సామ్రాజ్యమునకు సంబంధించిన నావనుగాని, నావికునిగాని, నావలోని ఉద్యోగస్తులనుగాని, నావలోని పని చేయువారినిగాని, ప్రయాణీకులనుగాని, నావలోని భర్తీనిగాని యేమియని ప్రశ్నించు నధికారము భారత ఫెడరలు శాసన సభకుగాని, రాష్ట్ర శాసనసభలకుగాని లేదు. 1928 సం॥నందు యస్. యన్. హాజీగారివల్ల భారతశాసనసభలో భారతదేశపు కోస్తా వ్యాపారమంతయు భారతదేశపు నావలే చేయవలెనని ప్రవేశ పెట్టబడిన బిల్లు ఫెడరలు రాజ్యాంగపద్ధతికి విరుద్ధము .భారత దేశపు కోస్తా వ్యాపారమంతయు బ్రిటిషు నావల చేతియందున్నది. ఇందులో 13% మాత్రమే భారతీయ నావల వశమునందున్నది. సముద్ర వ్యాపారములో భారతీయ నావలవంతు 2%. బ్రిటిషు సామ్రాజ్యములోని సముద్రవ్యాపారముతో భారతదేశమున కేవిధ మైన హక్కుగాని, అధికారముగాని, పలుకుబడిగాని లేదు. అందువల్ల భారతీయ నావికావ్యాపారమునకు బ్రిటిషు సామ్రాజ్య ములో సౌకర్యములు దొరకుననుట అపద్ధము. కాని బ్రిటిషు నావికా వ్యాపారముమాత్రము నిరాటంకముగా జరిగిపోవును.

ఫెడరలు రాజ్యాంగపద్ధతిక్రింద నేర్పడు మంత్రులకు భారతీయ వ్యాపారమునుగాని, పరిశ్రమలనుగాని, పరపతినిగాని వృద్ధిచేయుట కేవిధమైన స్వాతంత్ర్యమూలేదు. భారతదేశపు ఆర్థిక పరిపాలనలో బ్రిటిషువారి నిరంకుశత్వ మిప్పటికంటె ఈ ఫెడరలు రాజ్యాంగముక్రింద మరింత హెచ్చునుగాని తగ్గదు.

# ప్రభుత్వాదాయముపై ప్రజల అధికారము

ప్రజాప్రభుత్వములుగల రాజ్యములలో ప్రభుత్వము యొక్క ఆదాయ వ్యయములపైన ప్రజలకు సంపూర్ణాధికారముండును. ప్రజాప్రభుత్వములుగల ప్రతిదేశమునందును ప్రజలు తమ యధికారమును చాలభద్రముగా కాపాడుకొనుచున్నారు. కాని ఈ విషయమున ఇండియాస్థితి వేరు. 1919 సం॥రపు 'మాంటాగో చెంసుఫర్డు సంస్కరణములు రాకముందు భారత దేశములో ప్రభుత్వాదాయ వ్యయములపైన గవర్నరుజనరలు గారికిని, గవర్నరులకున్ను సంపూర్ణాధికార ముండినది. అప్పటి కౌన్సిళ్ళకు పన్నుల వసూలు విషయములోగాని, వసూలుకాబడిన పన్నులను కర్చుపెట్టు విషయమైగాని యేలాటి స్వాతంత్ర్యముగాని మాటగాని వుండలేదు.

1919 సం॥ సంస్కరణములు అమలులోనికి వచ్చిన తరువాత యీ స్థితిలో కొంతమార్పు కలిగినది. కేంద్రప్రభుత్వము చేయునట్టి కొన్ని కర్చులకు శాసనసభవారి వోటు తీసుకోవలసి వచ్చినది. కాని ఈ ప్రభుత్వముయొక్క వ్యయములకు 80% కు పైగా శాసనసభయొక్క సమ్మతి యనవసరము. ఈ మొత్తము పైన గవర్నరుజనరలు సంపూర్ణాధికారము కలిగి యున్నాడు. శాసనసభ సమ్మతి కాబట్టనిశాఖ లేవియన సైన్యము

రాజకీయశాఖ, మతశాఖ, ఋణములు స్టేటుసెక్రెటరీగారివల్ల నియమింపబడ్డ ఉద్యోగస్తుల జీతములు, ,ఫింఛనులు. శాసనసభ వారు వోటుచేయునట్టి కర్చులైనను వారికి లోబడియుండలేదు. శాసనసభవారు త్రోసివేసిన యేకర్చుపద్దయినను గవర్నరు జనరలు తన స్వంతబాధ్యతను నెరవేర్చుటకై పునరుద్ధరింప వచ్చును. ఈ పునరుద్ధరణ (Restoration) పద్ధతి గవర్నరు జనరలుగారు యీ సంస్కరణములు వచ్చినతరువాత చాలమారు లనుసరించినారు. అందుచేత భారతదేశపు శాసనసభలకు ఈ సంస్కరణములవల్ల వాస్తవమైన యధికారము దొరకలేదు. శాసనసభ వోటుచేయునట్టి యధికారముకూడా బూటకము. కార్య నిర్వహణ శాఖపైన శాసనసభ కేలాటియధికారముగాని, మాటగాని లేదు.

రాష్ట్రములలో నీసంస్కరణముల ననుసరించి ద్వంద్వ ప్రభుత్వము (Dyorchy) యేర్పడినది. దేశాభివృద్ధి కనుకూలమగు ఆరోగ్యము, విద్య, పబ్లికువర్క్సు, వ్యవసాయము, స్థానిక ప్రభుత్వము, పరిశ్రమల యభివృద్ధి, యీశాఖలపైన రాష్ట్రి శాసనసభల కధికార మివ్వబడినది. ఈ శాఖలకు ట్రాన్సుఫర్డు శాఖలని పేరు. తక్కిన శాఖలను రిజర్వుడు శాఖలని గవర్నరుల చేతిక్రింద యుంచబడినవి. ఈ రిజర్వుడుశాఖలలో ముఖ్యమైనవి న్యాయపరిపాలన, పోలీసు, జైళ్ళు, భూమిశిస్తు నీటిపారుదల, క్షామనివారణ, వార్తాపత్రికలపైన యధికారము, పుస్తకములు, ముద్రణశాలలు, కర్మాగారముల తనిఖీ.

రాష్ట్రీయ శాసనసభలకు రాష్ట్రీయ ఆదాయవ్యయ పట్టిక (Budget) పైన వోటుచేయు నధికార మొసగబడినది. రిజర్వుడు శాఖకు సంబంధించిన కర్చు పద్దులను శాసనసభవారు తిరస్కరించినయెడల గవర్నరుగారు తన స్వంతబాధ్యత నెరవేర్చుటకై పునరుద్ధరింపవచ్చును. అందుపైన ఆ పద్దులు శాసనసభవారామోదించినట్టేయగును. ప్రత్యేకింపబడినశాఖలకు (Transferred Departments) సంబంధించిన పద్దులను (Demands) శాసనసభవారు తిరస్కరించేయెడల గవర్నరుగారు తానావిషయమున కలుగజేసికొనుట న్యాయమనియు తిరస్కరించిన కర్చుపద్దు మొత్తము ఆశాఖానిర్వహణమునకు కావలసినదేననియు, రాష్ట్రమునందలి రెండుశాఖలమధ్య సరిసమానమైనపరిపాలనయుండుటవసరమనియు చెప్పి శాసనసభవారు తిరస్కరించిన పద్దును పునరుద్ధరింపవచ్చును. అప్పటి కాపద్దు శాసనసభవారిచేత నామోదింపబడినట్లే యగును. అందువల్ల రాష్ట్ర ప్రభుత్వములయొక్క ఆర్థికపరిపాలనలో గవర్నరు మాటయే తుదిమాట. ఈ విషయమై యతని కొసగబడిన యధికారములు నిరంకుశములైనవి. అవి అంతులేనివి. గవర్నరుగారు తన కివ్వబడిన యిట్టి ప్రత్యేకాధికారమును పలుమార్లుపయోగించినాడని పై మనుసంఘమువారే ఒప్పుకొన్నారు. ట్రాన్సుఫర్డు శాఖలను పస్తుపెట్టి తనయొక్క రిజర్వుడు శాఖలను పోషించుటకే గవర్నరుగా రీయధికారము లుపయోగించినారు అందువల్ల రాష్ట్రాదాయములో చాలవంతు యీ రిజర్వుడు శాఖలకే యొసగబడి రాష్ట్రాభివృద్ధి కనుకూలించి ట్రాన్సుఫర్డు శాఖలవు

డబ్బులేక సన్నగిల్లి నశించినవి.

పై విషయములుబట్టి 1919 సం॥మున నొసగబడిన సంస్కరణములవల్ల కేంద్రశాసనసభకుగాని, రాష్ట్రశాసనసభకు గాని యెట్టి అధికారముగాని, స్వాతంత్ర్యముగాని యొసగబడ లేదని తెలియుచున్నది,

భారతశాసనసభలపైన పరిపాలనాశాఖ కీయధికారము లుండవలసినదేనని పార్లమెంటువారు సమర్థించుచున్నారు. భారతదేశపు రక్షణ, దేశముయొక్క ఖాతా, బ్రిటిషు పెట్టుబడి ధనము, స్టేటు సెక్రెటరీవల్ల నియమింపబడ్డ ఉద్యోగులయొక్క జీతాలు, పెన్షనులు, సంసారపు పెన్షనులు, ప్రావిడెంటుఫండులు. వీనిని కాపాడుటకును బ్రిటిషువారియొక్క ప్రత్యేకబాధ్యతను నెర వేర్చుటకును ఈ యధికార మవసరమనుచున్నారు.

ఈ ఫెడరలు రాజ్యాంగమునం దీపరిస్థితు లెంతవరకు మార్పుజెందినవో చూడుడు. 1935 వ సంవత్సరపు ఇండియా చట్టము ననుసరించి కేంద్రప్రభుత్వముయొక్క వ్యయములు రెండువిధములు. (1) ఫెడరల్ ఆదాయముపైన వేయబడు కర్చులు. (1) ఫెడరల్ వరంబడిలో కర్చుపెట్టవలయుననుకొను మొత్తములు. ఇందులో మొదటి కర్చుపద్దులకును శాసనసభ కును సంబంధములేదు. ఈ కర్చు పద్దులకు శాసనసభవారివోటు అనవసరము. ఈ భాగమునందు భారతదేశ రక్షణకగు కర్చు, మతసంబంధమైన కర్చులు, రాజకీయశాఖకగు కర్చు. భారతదేశపు

బుణము ప్రత్యేకప్రదేశముల (Excluded areas) పరిపాలన గవర్నరు జనరలుగారి జీతము, అలవెన్సు, అతని సలహాదారుల జీతాలు అలవెన్సులు, మంత్రుల జీతాలు అలవెన్సులు, అడ్వకేటు జనరల్‌గారి జీతము, అలవెన్సు, ఛీపుకమీషనరుయొక్కయు, ఫెడరలుకోర్టు న్యాయాధిపతులయొక్కయు జీతాలు, అలవెన్సులు చేరినవి. ఈ మొత్తమంతయు కలిసి కేంద్రప్రభుత్వముయొక్క వ్యయములో 80% అగును. తక్కిన 20% లో ఫెడరలు ఆదాయములో కర్చుపెట్టవలయు ననుకొను శాఖల కియ్యవచ్చును. ఈ చట్టములోకూడా గవర్నరుజనరలుగారి మాటయే తుదిమాట.

ఫెడరలు వరంబడిలో కర్చుపెట్టవలసివచ్చు మొత్తము కేంద్రప్రభుత్వముయొక్క వ్యయములో 15% కంటె కొంత యెక్కువ. ఈ మొత్తమునకు శాసనసభవారి వోటు ఆవశ్యకము. కాని యీమొత్తముపైన అధికారము సంపూర్ణముగాలేదు. గవర్నరు జనరలు మంచిదని తలచి తన ప్రత్యేకబాధ్యత నెరవేర్చుటకై శాసనసభవారిచే తిరస్కరింపబడ్డ మొత్తమునుగాని, అందులో కొంతభాగమునుగాని పునరుద్ధరింపవచ్చును. ఈ ప్రత్యేకబాధ్యతలు చాల విశాలమైనవి. ఒకరీతిగా అర్థము చెప్పుటకు సాధ్యముకానివి. మొదలు కొన లేనివి. ఎంత లాగితే యంతసాగునవి. 1919 సం॥రపు సంస్కరణముల ననుసరించి శాసనసభవారిచే తిరస్కరింపబడిన మొత్తమును గవర్నరు జనరలు తన కౌన్సిలుతో ఆలోచించి పునరుద్ధరింపవలసి యుండినదిగాని 1935 సం॥పు ఫెడరలు రాజ్యాంగపద్ధతిలో

గవర్నరుజనరలుగారొక్కరే తిరస్కరింపబడిన మొత్తమును పునరుద్ధరింపవచ్చును. గవర్నరు జనరలుగారి యనుమతి ముందుగా పొందినగాని గుత్తలువేయుటకును, కర్చుచేయుటకును, అప్పుచేయుటకును భారత ఫెడరలు శాసనసభ కధికారములేదు.

ఇంతేకాక బ్రిటిషు పెట్టుబడిధనము, ఫెడరల్ రిజర్వు బ్యాంకు, రైల్వేలు, వీనిపైన సంపూర్ణమైన యధికారము శాసనసభవారి చేతినుండి తప్పింపబడినది. రిజర్వుబ్యాంకు నిర్వహణమునకై తన యిష్టమువచ్చిన గవర్నరునుగాని, డిప్యూటీ గవర్నరునుగాని నియమించుట, తనకిష్టమైనపుడు సెంట్రల్ బోర్డు డైరెక్టరుల నధికారమునుండి తొలగించుట, బ్యాంకును మూసివేయుట ఈ యధికారములు గవర్నరుజనరలుగారి కొసగబడినవి. ఇండియా రిజర్వుబ్యాంకు విషయమైగాని, నాణ్యముల విషయమైగాని, నోట్లవిషయమైగాని శాసనసభవారు తీర్మానములు గాని, సవరణలుగాని ప్రవేశపెట్టుటకు ముందు గవర్నరు జనరలు గారి యనుమతి పొందవలయును. భారతదేశమునందలి బ్రిటిషు పెట్టుబడిధనమును, వారి పరిశ్రమలును సంపూర్ణముగా రక్షింపబడుటకుగాను భారతదేశములోని బ్యాంకింగు వ్యవహారమంతయు బ్రిటిషువారి చేతియందుంచబడినది. ఇండియాదేశపు రైల్వేలలో బ్రిటిషువారు పెట్టుబడిగాపెట్టిన ధనమును భద్రపరచుటకును, కాపాడుటకును భారతీయుల కేవిధమైన యధికారములేదు. రైల్వేల పరిపాలనకై 'ఫెడరల్ రైల్వే అథారిటీ'బోర్డు నొకదాని నేర్పరచినారు. ఈబోర్డువారికి భారతదేశములో రైల్వేలు

వేయుటకును, వానిని నడుపుటకును, వానిని కాపాడుటకును కావలసిన సంపూర్ణాధికార మొసగబడినది. ఈ బోర్డుకు 3/7 మెంబర్లనుగాని లేక యేడుమందినిగాని నియమించు అధికారము గవర్నరుజనరలుదే. ఈ బోర్డుకు అధ్యక్షుని నియమించు అధికార మతనిదే. ఈ రైల్వేబోర్డు గవర్నరుజనరలుగారికి లోబడి యుండవలసినదేకాని ఫెడరలు శాసనసభకు లోబడి యుండవలసినదిలేదు. అందువల్ల బ్రిటిషువా రింతవరకు రైల్వేలవల్లను, పెద్దపెద్ద కర్మాగారములవల్లను సంపాదించుకొనుచున్న ద్రవ్యమును తాకుటకు ఫెడరలు శాసనసభ కధికారములేదు. ఇండియా సరకుల కనువగు మార్కెట్ల కనుగొనుటకుగాని, పెద్దపెద్ద ఇంజనులు, వాగెనులను నిర్మించుటకుగాని, ఇనుము పుక్కావీనివల్ల రైల్వేసామానులు తయారుచేయుటకుగాని పెద్దపెద్ద కర్మాగారముల నిర్మించుటకుగాని అధికారము ఫెడరలు శాసనసభకు లేదు.

ఇంపీరియల్ ఉద్యోగస్థుల గొప్పగొప్ప జీతాలు, అలవెన్సులు తగ్గించుటకు ఫెడరలు శాసనసభ కధికారములేదు. ఈ ఇంపీరియల్ ఉద్యోగులను నియమించువాడు స్టేటు సెక్రిటరీగారే, ఫెడరలు మంత్రుల ఉత్తరువులపైన ఈ ఇంపీరియల్ ఉద్యోగులు స్టేటుసెక్రెటరీగారి కపీలుచేసుకోవచ్చును. మంత్రుల వుత్తరువులు రెండువిధములు. (1) ఇంపీరియల్ ఉద్యోగిని దండించుట లేక యతనిపై విశ్వాసములేకుండ చేయుట. (2) ఇంతవరకుండు ఉద్యోగులనియమముల మార్చుట, ఇదివర

కుండిన ఉద్యోగమునుండి విరమించుచున్న కాలము తగ్గించుట.

రాష్ట్రములలో ద్వంద్వపరిభుత్వము పోయినను యీ ఫెడరలు రాజ్యాంగచట్టమువల్ల రాష్ట్రములో గవర్నరే సర్వాధికారిగానున్నాడు. రాష్ట్రీయవ్యయములు రెండువిధములు. (1) రాష్ట్రాదాయములో కర్చుపెట్టి తీరవలసిన మొత్తములు (2) రాష్ట్రాదాయములో కర్చుపెట్టవలసివచ్చు మొత్తము. ఇందులో మొదటికర్చు మొత్తములకు శాసనసభవారి సమ్మతి కావలెను. ఈ మొత్తములో గవర్నరుగారి జీతము, అలవెన్సు, అతని ఆఫీసు కర్చులు జాతీయఋణమునకు రాష్ట్రప్రభుత్వము లచ్చువలసిన మొత్తము, మంత్రుల జీతాలు, అలవెన్సులు, హైకోర్టు జడ్జీలు, అడ్వకేటు జనరలుగారి జీతములు, బత్తెములు ప్రత్యేకింపబడిన ప్రదేశపరిపాలనకగు కర్చు ఇందులోచేరినవి. రాష్ట్రాదాయమునందు తక్కువమొత్తములను కర్చుపెట్టుటకు శాసనసభవారి కధికారమున్నదిగాని గవర్నరుగారి యనుమతిలేనిదే యే గ్రాంటును శాసనసభవారు మంజూరుచేయకూడదు. వైస్రాయిగారి వలెనే గవర్నరుకూడా శాసనసభవారు త్రోసివేసిన గ్రాంటును తన ప్రత్యేకబాధ్యతను నెరవేర్చుటకుగాను పునరుద్ధరింపవచ్చును. ఈ ప్రత్యేకబాధ్యతలు చాలవిశాలమైనవి. శాసనసభవారివల్ల త్రోసివేయబడు ప్రతిగ్రాంటు మొత్తమును. గవర్నరు పునరుద్ధరించుట కనుకూలమగురీతి యతని ప్రత్యేకబాధ్యతలు నిర్వచింపబడినవి.

పై అంశములవల్ల క్రొత్తరాజ్యాంగచట్టమువల్ల భారత

దేశ కేంద్రశాసనసభకుగాని, రాష్ట్రశాసనసభలకుగాని ఆర్థికముగా యేవిధమైన స్వాతంత్ర్యమూ లభింపలేదు. ఏదైనా కొంతమార్పు వచ్చుననునదికూడా భారతజాతియొక్క ముప్పునకేగాని వేరుకాదు. పూర్వమునకంటె ఈ క్రొత్తరాజ్యాంగములో గవర్నరులకున్ను వైస్రాయికిన్ని ప్రత్యేకాధికారము లెక్కువైనవి. పరిపాలనాశాఖ శాసనసభమీద సవారీచేయుట కనుకూలమేర్పడినది. ఫెడరేషను, రాష్ట్రీయస్వాతంత్ర్యము యనునవి వట్టిబూటకములు.

# రాష్ట్రములలో ఆర్థికస్వాతంత్ర్యము

రాజకీయశాస్త్రములో దేశాదాయమును రాష్ట్రప్రభుత్వములకున్ను, కేంద్రప్రభుత్వమునకున్ను యేరీతిగా పంచిపెట్టవలయునను విషయము చాలముఖ్యమైనది. ప్రపంచమందు దాదాపు అన్నిదేశములయందును రాష్ట్రప్రభుత్వములు ప్రజాభివృద్ధికరములగు విద్య, ఆరోగ్యము, పారిశుద్ధ్యము, పరిశ్రమలు మరికొన్నిశాఖలను కేంద్రప్రభుత్వముయొక్క సహాయ్యములేకనే తామే నిర్వహించుచున్నవి. చాలముఖ్యమైనట్టియు, విశాలమైనట్టియు, దేశసంరక్షణ, ఇతరరాజ్యములతోడి సంబంధము, నోట్లు, మారకపురేటు, వ్యాపారశుల్కములవిధించుట యీ ముఖ్యమైన విషయములను కేంద్రప్రభుత్వము చూచుకొనును. ప్రజాభివృద్ధి కనుకూలించు శాఖల నిర్వహణమునకుగాను కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములకు తగినంత ధనము చూపవలయును. కేంద్రప్రభుత్వము తన పరిపాలనక్రిందనుండు శాఖలగు దేశసంరక్షణ మొదలగువానిపైన తన ఆదాయమునంతయు కర్చుపెట్టినయెడల రాష్ట్రప్రభుత్వములకు డబ్బులేక ప్రజానురంజకములగు కార్యములన్నియు మూలబడును. అందువల్ల ప్రపంచమునందన్నిదేశములవారును రాష్ట్రప్రభుత్వములకు తగినంత ధనము సమకూర్చుటయే ఒకసిద్ధాంతముగా నంగీకరించినారు. ఈ విషయములలో భారతదేశపు పరిస్థితియు వేరు. ప్రజాభివృద్ధి కనుకూలించు శాఖలన్నియు రాష్ట్రప్రభుత్వముచే నిర్వహించుచుండినను

కేంద్రప్రభుత్వము ప్రభుత్వాదాయమంతయు తానే కాజేయుటవల్ల రాష్ట్రప్రభుత్వ శాఖలగు విద్య, పరిశ్రమలు, వ్యవసాయము వీని నిర్వహణమునకుగాని, అభివృద్ధికిగాని కావలసినంత డబ్బు లేక పోయినది. భారతదేశపు సైన్యమునకగు ఖర్చు అపారము. కేంద్రప్రభుత్వమునందును, రాష్ట్రప్రభుత్వములందును భరింప నలవికాని వ్యయముచే ప్రభుత్వములు సాగుచున్నవి. దేశ సంరక్షణ, సివిల్ పరిపాలన, లా అర్డరు సంరక్షణ యివి చాల వుత్కృష్టమైనవని ప్రభుత్వాదాయములో 80% వీని నిర్వహణ మునకై ప్రత్యేకింపబడినది.

ఫెడరల్ రాజ్యాంగచట్ట నిర్మాతలగు పెద్దలు యీ చట్టము ననుసరించి రాష్ట్రములకు సంపూర్ణ స్వాతంత్ర్య మొసగ బడినదనియు, ప్రజాభివృద్ధి కరములగు శాఖల ఖర్చులకై కావలసినంత ద్రవ్యము రాష్ట్రప్రభుత్వములకు ప్రత్యేకింపబడిన దనియు చెప్పుచున్నారు. ఇకముందు రాష్ట్రప్రభుత్వములు తమ యాదాయమును తమ యిచ్చవచ్చినట్లు ఖర్చుపెట్టవచ్చు ననియు, అందుకై కేంద్రప్రభుత్వముపై నాధారపడవలసిన యవసరము లేదనియు చెప్పుచున్నారు. రాష్ట్రప్రభుత్వములకు ప్రజాభివృద్ధికరములగు శాఖల నిర్వహణమునకగు ఖర్చులకు తగినంత ధనము చూపవలయునుగాని వట్టిమాటలచే ప్రయోజ నములేదు. అట్టిమాట లర్థములేనిమాటలు. ఈ క్రింది విష యములబట్టి ఆవాద మపద్ధమని తెలియును.

# రాష్ట్రాదాయపు అభివృద్ధి

ఈస్టు ఇండియా కంపెనీయొక్క తొలిదినములలో భారతదేశమున కంపెనీవారికి సంబంధించిన ప్రదేశములు ఆర్థిక విషయములలో సంపూర్ణస్వాతంత్ర్యము కలిగియుండినవి. ఆకాలమందు బలిష్ఠమైన కేంద్రప్రభుత్వము లేనందువల్లను, రాకపోకలకు చాల కష్టమగుటవల్లను ప్రభుత్వాదాయమును కేంద్రీకరించి కేంద్రప్రభుత్వము తన చేతిక్రింద నుంచుకొనుట చాల కష్టముగా నుండెను. 1773 సం॥రపు రెగులేషన్ చట్టము ననుసరించి దేశాదాయము కేంద్రీకరింపబడినది. శిస్తులన్నియు వసూలైన తోడనే కేంద్రప్రభుత్వమునకు పంపవలసినదిగాను, కేంద్రప్రభుత్వముయొక్క ఉత్తరువులేక యేమొత్తముగాని కర్చుపెట్టకూడదనియు ఉత్తరువు చేయబడినది. కాని యానాటి కేంద్రప్రభుత్వమునకు తగినంత బలము లేనందువల్ల రాష్ట్రప్రభుత్వములయొక్క వ్యయములపై నధికారము చలాయించుటకు సాధ్యము లేకపోయినది, అందువల్ల ఆకాలములో రాష్ట్రప్రభుత్వములు తమ జవాబుదారీ గుర్తెరుగక నానావిధములైన గుత్తలు వేయుచు, వసూలుచేయుచు, యిచ్చవచ్చిన విధమున కర్చుపెట్టుచూ వచ్చినవి. ఈ విషయమై సర్ జాన్ స్ట్రాచి (Sir John Strachy) ఇట్లుచెప్పుచున్నారు. "ప్రజలచే వసూలైన సొమ్మును పంపకము చేయుటలో న్యాయాన్యాయ విచక్షణగాని, ధర్మాధర్మ పరిజ్ఞానముగాని, నీతిగాని, నియమముగానీ, కారణము

గాని అనుసరింప బడుచుండలేదు. అధికారులొకరితో నొకరు ధనమునకై పోరాడుకొనుచుండిరి. అందులో నెవ్వరు యెక్కువ దౌర్జన్యపరులో వారికే యెక్కువ ధనము దొరకుచుండినది. స్థానిక వ్యయముల కంతులేదు. తగ్గింప సాధ్యపడు ఖర్చులుకూడా తగ్గించనందున ప్రజలు నశించిపోయిరి. ప్రజలచే న్యాయముగా వసూలుకాబడు గుత్తలు తగ్గి అన్యాయముగాను, అక్రమముగాను, దౌర్జన్యముగాను, వసూలుకాబడు గుత్తలు యెక్కువైనవి." 1871 సం॥ నందు లార్డుమేయో (Lord Mayo) గారు ఆర్థిక కేంద్రీకరణమునకై యొకపద్ధతి కనిపెట్టిరి. ఇతని యొక్క ప్రొవిన్షియల్ సెటల్‌మెంట్సు (Provincial Settlements) ద్వారా పోలీసు, విద్య, రోడ్లు, సివిల్‌వర్క్సు, రిజిష్ట్రేషన్, వైద్యము, జైళ్ళు, యీశాఖల పరిపాలనయంతయు రాష్ట్రములకు సంక్రమించినది. కేంద్ర ప్రభుత్వము యీశాఖల పరిపాలనకు కొంతసొమ్ము రాష్ట్రములకు మంజూరు చేయుచుండినది. ఈ శాఖలవల్ల వచ్చు వరుంబడియంతయు రాష్ట్ర ప్రభుత్వముదే. ఈపద్ధతివల్ల పరిపాలన న్యాయముగా జరుగలేదు. కేంద్ర ప్రభుత్వము ప్రతి సంవత్సరము రాష్ట్ర ప్రభుత్వములకు మంజూరు చేయుచుండిన గ్రాంటు ఆయారాష్ట్రముల యార్థికాభివృద్ధి గమనించి చేయబడుచుండలేదు. కేంద్ర ప్రభుత్వము తనయిష్టము వచ్చినరీతి గ్రాంటులు పంచిపెట్టుచు వచ్చినది. అందువల్ల రాష్ట్రములలో పరిపాలన న్యాయముగను, విచక్షణతోను జరుగుట కవకాశము లేకపోయినది. రాష్ట్ర ప్రభుత్వములు తక్కువ

పడిన మొత్తమునకు గుత్తయువేసి భర్తీచేసికొనుట కధికారముండి నది కాని కేంద్ర ప్రభుత్వ మదివరకే వేయవలసిన గుత్తలన్నియు వేసియుండినందున ప్రయోజనము లేకపోయెను. గుత్తలు వేసి నను చాల దరిద్రులును, దిక్కులేనివారునునగు ప్రజలపై వేయ వలసి యుండినదిగాని వేరుమార్గములేదు.

1877 సం॥ నందు లార్డు లిట్టనుగారు మరికొన్ని శాఖలను కేంద్ర ప్రభుత్వ పరిపాలన నుండి వేరుచేసిరి. భూమిశిస్తు. ఎక్సైజు, స్టాంపులు, సాధారణపరిపాలన, లా, జస్టిసు, యీ శాఖలు రాష్ట్రప్రభుత్వములపాలికి బడినవి. ప్రతి సంవత్సరము కేంద్ర ప్రభుత్వము నుండి రాష్ట్ర ప్రభుత్వములకు వచ్చుచుండిన గ్రాంటు మొదటిరీతిగనే వచ్చు చుండినది. ఇందుకుతోడు ఎక్సైజు, స్టాంపులు, లా, జస్టిస్సు, యీ శాఖలవల్ల వచ్చు ఆదాయములో కొంతభాగము రాష్ట్ర ప్రభుత్వముల కివ్వబడినది. లైసెన్సువల్ల వసూలైన మొత్తములో కొంత రాష్ట్రప్రభుత్వము లకు వచ్చినది. అప్పటి నుండియు కేంద్రప్రభుత్వమున్ను రాష్ట్ర ప్రభుత్వములున్ను కొన్ని కొన్ని శాఖలనుండి వచ్చు ఆదాయ మును పంచుకొనవలయునను సిద్ధాంత మేర్పడినది.

1882 సం॥లో లార్డురిప్పనుగారు కేంద్రప్రభుత్వ మున్ను, రాష్ట్రప్రభుత్వములున్ను ప్రభుత్వాదాయములో చేసుకొను చుండిన పంపకమునందు కొంతమార్పు తెచ్చిరి. ఇందువల్ల ప్రతిసంవత్సరము కేంద్రప్రభుత్వము మంజూరుచేయుచుండిన

గ్రాంటు రద్దుకాబడినది. ప్రభుత్వాదాయము మూడు విభాగములుగ విభజింపబడినది. (1) ఇంపీరియల్ హెడ్సు, ఇందులో ఉప్పు కష్టమ్సు, వ్యాపారవిషయములు మరికొన్ని చేరినవి. (2) ప్రావిన్షియల్ హెడ్సు, ఇందులో సివిల్ శాఖలు, రాష్ట్రియరేట్లు చేరినవి (3) కేంద్రప్రభుత్వమునకును, రాష్ట్రప్రభుత్వములకునుకూడా చేరినవి. (Divided Heads) ఇందులో ఎక్సైజు, అసెస్సుమెంటులు, స్టాంపులు, అడవులు, రిజిస్ట్రేషన్ శాఖలు చేరినవి. ఇంపీరియల్ హెడ్సుద్వారా వసూలుకాబడు శిస్తులు కేంద్రప్రభుత్వము వారివే. ప్రొవిన్షియల్ హెడ్సుద్వారా వచ్చు వరంబడి రాష్ట్రప్రభుత్వమువారిదే. కేంద్రప్రభుత్వమునకును, రాష్ట్రప్రభుత్వములకును సంబంధించిన శాఖలవల్ల వసూలుకాబడు గుత్తలు రెండు ప్రభుత్వములును పంచుకోవలయును. ఈ మార్పువల్ల రాష్ట్రప్రభుత్వములకు ప్రభుత్వాదాయములో కొంత మొత్తమొసగబడినది. రిప్పన్ స్కీము ననుసరించి కేంద్రప్రభుత్వము ప్రతిరాష్ట్ర ప్రభుత్వముతో ప్రత్యేకముగా ఒడంబడికలు గావించుకొన్నది.

ఈ యొడంబడికలు శాశ్వతమైనవిగావు. అయిదు సంవత్సరముల కొకతూరి మారుతూవచ్చినవి. అప్పటప్పటికి వచ్చుచుండిన ఈ మార్పువల్ల రాష్ట్ర ప్రభుత్వములయొక్క ఆదాయము హెచ్చుచూ తగ్గుచూ వచ్చినది. అందులో రాష్ట్రప్రభుత్వములన్నియు ఒక్కరీతి చూడబడుచుండలేదు. రాష్ట్రప్రభుత్వములలో యీ మార్పువల్ల ఆర్థికముగా నిలకడలేక అవి

చేయునట్టియు, చేయదలచినట్టియు వ్యవహారములు తలక్రిం
దైనవి. కేంద్రప్రభుత్వ మెట్టిమార్పునకువచ్చినను యెప్పటికిని,
యేపరిస్థితులందును తనకు రావలసినవంతు తగ్గించుకోలేదు.

1904 సం॥లో లార్డుకర్జనుగారు ఈ కేంద్రప్రభుత్వము
నకును, రాష్ట్రప్రభుత్వములకుకు మధ్యజరిగిన యొడంబడికలను
బాగుచేయు నుద్దేశముతో రాష్ట్రప్రభుత్వములు కేంద్రప్రభుత్వ
ముతో గావించుకొన్న ఈ ఆర్థిక యొడంబడికలు శాశ్వతమైనవి
గావని ప్రకటించిరి. ఈ కట్టుబాట్లు విపరీతపరిస్థితులగు
యుద్ధములు వచ్చినప్పుడుతప్ప సాధారణ సమయమందు మార్పను
వీలులేదని చెప్పినాడు. ఇందువల్ల రాష్ట్రప్రభుత్వముల ఆదాయ
మునకు కొంతనిలకడ కలిగినదని చెప్పవచ్చును. కేంద్రప్రభుత్వ
బడ్జెట్టులో ఆదాయమువచ్చినప్పుడు రాష్ట్రప్రభుత్వములకు ఆ
యాదాయములో కొంచెముగ్రాంటు లేక 'డోల్సు' (Doles) ఇవ్వవల
యునని నిర్ధరింపబడినది.

1912 సం॥నందు లార్డుహార్డింజుగారు యీ ఆర్థిక
యొడంబడికలు శాశ్వతమైనవని ప్రకటించిరి. తరువాత
1919 సం॥వరకు ఈ విషయమై యెట్టిమార్పున్ను జరుగలేదు.
1919 సం॥రపు సంస్కరణముల ననుసరించి దేశమం దీక్రింది
పరిస్థితులేర్పడినవి. కేంద్రప్రభుత్వమునకు కష్టమ్సు, పుప్పు,
ఓపియం, రైల్వే, మింటు, మారకము (Exchange), పోష్టు,
తంతి, స్వదేశసంస్థానములిచ్చు కప్పములు యీ శాఖలపై నవచ్చు

ఆదాయమంతయు చేరినది. రాష్ట్రప్రభుత్వములకు, అడవులు, ఎక్సైజు, (బొంబాయి, బెంగాలు మాత్రము) రిజిస్ట్రేషన్, విద్య, లా జస్టిసు యీశాఖలపైన వచ్చు ఆదాయము చేరినది. కేంద్ర ప్రభుత్వము రాష్ట్రములతో ప్రత్యేకముగా గావించుకొన్న యొడంబడిక ప్రకారము ఆదాయపుపన్ను, భూమిశిస్తు, ఇరిగేషన్, స్టాంపులు, ఎక్సైజు (బొంబాయి, బెంగాలు తప్ప) యీ శాఖల వల్లవచ్చు వరంబడి తమలోతాము పంచుకోవలయును. ఈ పంపకపుపద్ధతి చాలవిషయములలో లోపభూయిష్టమైనదిగా నుండినది. ఈ పద్ధతి నాధారముగా చేసుకొని కేంద్రప్రభుత్వము రాజధాని ప్రభుత్వముల వ్యవహారములలో పలుమారు కలుగ చేసుకొనుచు వచ్చినది. ఈ నాటికిని కారణములేక కలుగజేసుకొను విధాన మనుులోనున్నది. రాష్ట్రప్రభుత్వములు వేయునట్టి గుత్తల రేట్లను అందులకగు కర్చులను కేంద్రప్రభుత్వమే నిర్ధరించును. రాష్ట్రములకు గుత్తలు విధించుటకుగాని, అప్పు చేయుటకుగాని అధికారములేదు. కేంద్రప్రభుత్వము రాజధానీ ప్రభుత్వముల నన్నిటి నొక్కరీతిగా చూచుచుండలేదు. ఆ యా రాజధానుల ఆర్థికస్థితి గమనించి సాయపడుచుండలేదు. ముఖ్యముగా దేశాదాయమంతయు కేంద్రము మ్రింగి రాజధాని ప్రభుత్వములను పస్తు పెట్టుటవల్ల ఇచ్చట ప్రజోపయోగములగు కార్యములు మూలబడినవి. 1919–20 సం॥లోని సంస్కరణములు రాకముందు రాజధానులకు దేశాదాయములో 30% మాత్రమే దక్కుచుండినది.

1919 సం॥రపు మాంటాగూ చెంసుఫర్డు సంస్కరణ ములు అమలులోనికి వచ్చినవెంటనే కేంద్రప్రభుత్వమునకును, రాష్ట్రప్రభుత్వములకును అదివర కుండిన ఆర్థిక యొడంబడికలందు క్రొత్తమార్పు వచ్చినది. కాన్‌స్టిట్యూషన్ కమిటీవారు తమ రిపోర్టునం దిట్లుచెప్పినారు. "రాష్ట్రప్రభుత్వములు సంపూర్ణ స్వాతంత్ర్య మనుభవించవలయునన్న తమయొక్క కార్యక్రమ ములకు కావలసిన ద్రవ్యమునకు కేంద్రప్రభుత్వముపైన నాధార పడకూడదు. ఇప్పటివరకు రాష్ట్రప్రభుత్వములకు కేంద్ర ప్రభుత్వ మిచ్చు గ్రాంటుచే రాష్ట్రములలో సాధారణ పరిపాలన జరుగుచున్నదిగాని పెద్దపెద్ద పనులు చేయసంకల్పించినపుడు రాష్ట్రప్రభుత్వములు కేంద్రప్రభుత్వ మిచ్చు 'డోల్సు'పై నాదార పడవలసియున్నది. భారత ప్రభుత్వమునకు సంబంధించిన ఉద్యోగముల కెంతకావలయునో ఆ మొత్తముతప్ప తక్కిన ద్రవ్యమంతయు రాష్ట్రప్రభుత్వముల చేతులం దుండవలయును." 1919 సం॥రపు సంస్కరణములవల్ల ప్రజోపయోగమైన పను లన్నిటిని రాష్ట్రప్రభుత్వములు నెరవేర్చవలెనను బాధ్యత యేర్ప డినది. ఇందునిమిత్తము పూర్వపు పంపకఃపుపద్ధతిపోయి రాష్ట్ర ప్రభుత్వములకును, కేంద్రప్రభుత్వములకును దేశాదాయమునందు, అనగా కేంద్రరాష్ట్ర ప్రభుత్వముల యాధీనమందుండు శాఖలవల్ల వచ్చు ఆదాయములో, పై రెండు ప్రభుత్వములకు వచ్చు వంతు నిర్ధరింపబడినది. కష్టమ్సు, ఆదాయపుపన్ను, రైల్వే, ఉప్పు, ఓపి యం, పోష్టు, టెలిగ్రాము, సైన్యము ఈశాఖలన్నియు కేంద్రము

నకు సంబంధించినవి. భూమిశిస్తు, నీటిపారుదల, స్టాంపులు, రిజిస్ట్రేషన్, ఎక్సైజు, అడవులు, యీ శాఖలు రాష్ట్రముల వశమైనవి. ఈ సంస్కరణములద్వారా రాష్ట్రప్రభుత్వములకు గుత్తలు వేయుటకున్ను, అప్పుచేయుటకున్ను చాల విశాలమైన యధికారములు దొరికినవి.

మొట్టమొదట ఈ సంస్కరణము అమలులోనికి వచ్చి నపు డీపద్ధతి చాల మంచిదనిపించినది కాని కార్యరీతిగా ఈపద్ధతి పూర్వపద్ధతి యైనది. రాష్ట్రప్రభుత్వములకున్ను, కేంద్రప్రభుత్వ మునకున్ను మధ్యజరిగిన యొడంబడికవల్ల కేంద్రప్రభుత్వము యొక్క ఆదాయవ్యయ పట్టికలో లెక్కలేనంత లోటు రాజా చ్చినది. ఈ లోటు భర్తీచేయుటకుగాను కేంద్రప్రభుత్వము న్యాయముగా తనయొక్క కర్చులు తగ్గించుకోవలసి యుండినది. అట్లు జరుగలేదు. కేంద్రప్రభుత్వమునకు, రాష్ట్రప్రభుత్వములు మాత్రము, లోటును భర్తీచేసుకొనుటకు ప్రతి సంవత్సరము కొంతమొత్తము కాంట్రిబ్యూషన్‌క్రింద యివ్వవలసి వచ్చినది. ప్రతిరాష్ట్రమూ యెంతమొత్తము కేంద్రప్రభుత్వమునకు కంట్రి బ్యూషన్‌క్రింద యివ్వవలయునో నిర్ధరించుటకై 1920 సం॥నందు లార్డుమెస్టన్‌గారి యధ్యక్షతక్రింద నొకసంఘ మేర్పడినది. ఈ సంఘముయొక్క నీతి నియమములేని సిఫార్సులను సర్కారువా రంగీకరించిరి. ఈ సంఘమువారు రాష్ట్రప్రభుత్వముల ఆదాయ మెంతవరకు యభివృద్ధిగాంచినదో చూచిరిగాని వ్యయము గమ నింపరైరి. కొన్ని రాష్ట్రములు యెక్కువగాను, కొన్ని తక్కువ

గాను కేంద్రప్రభుత్వమునకు కంట్రిబ్యూషన్ మొత్తమును అచ్చ వలసినదిగా నిర్ధరించిరి. మదరాసు యునైటెడ్ ప్రావిన్సు పంజాబు ఈ మూడురాష్ట్రములు చేరి కేంద్రప్రభుత్వముయొక్క లోటులో 78 % భరింపవలసివచ్చినది. బొంబాయి 6½% న్ను బెంగాలు 5½% న్ను యిచ్చునదిగా నిర్ధరింపబడినది.

ఈ మెష్టన్ పరిష్కారము' (Meston Award) ను రాష్ట్రప్రభుత్వములు ధిక్కరించినవి. మెష్టన్ సంఘమువారు రాష్ట్రప్రభుత్వముల కెప్పటికిని ఆదాయమే వచ్చునని తలచి కేంద్ర ప్రభుత్వమున కియ్యవలసిన కంటిౖబ్యూషను మొత్తమును నిర్ధ రించిరి. లిట్టన్ రిపోర్టు ననుసరించి ప్రపంచయుద్ధము ప్రారంభ మైనతోడనే రాష్ట్రప్రభుత్వములు తమ నౌకర్లయొక్క జీతాల నెక్కువచేయవలసి వచ్చినది. బెంగాలు రాష్ట్రమందు మెష్టన్ సంఘమువా రూహించినదానికంటె యెక్కువ కర్చుపెట్టవలసి వచ్చినది. ప్రతిరాష్ట్రమూ యింతే. ప్రతిరాష్ట్ర ప్రభుత్వమూ కర్చులు తగ్గించుటకు ప్రయత్నించినది. కాని ప్రయోజనము లేకపోయినది. ఏవో కొన్ని రాష్ట్రములలోతప్ప తక్కిన రాష్ట్రములందు ప్రజోపయోగములైన కార్యములకు డబ్బులేదు.

'మెష్టన్ పరిష్కారము'వల్ల రాష్ట్రప్రభుత్వముల యొక్క కట్టుబాటు సడలినది. సంస్కరణములద్వారా రాష్ట్ర ప్రభుత్వములకు రావలసిన పంపకపు మొత్తమువల్ల రాష్ట్రముల యం దార్థికాభివృద్ధి కలుగలేదు. రాష్ట్రప్రభుత్వములకు కావలసి నన్ని పన్నులువేయుట కధికారమియ్యబడినది. కాని అందుకు

ముందు తగిలే కర్చులకు డబ్బు సున్న. ఉన్నది కొంచెము కేంద్రప్రభుత్వము తన్నుకొనిపోయినది. కేంద్రప్రభుత్వమునకు తన సైన్యమునకు కావలసినంత ధనము వచ్చుటకు సకలవిధము లైన సౌకర్యములు గావింపబడినవి. కేంద్రప్రభుత్వముయొక్క గుత్త లెక్కపై రాష్ట్రప్రభుత్వములయొక్క గుత్తలు తగ్గినవి. రాష్ట్రప్రభుత్వపు గుత్తలలో భూమిశిస్తు ముఖ్యమైనది. ఈ భూమి శిస్తు 1913 సం॥నుండి 1929 సం॥వరకు 7% మాత్రమే యెక్కువైనది. లిట్టన్ రిపోర్టులోచెప్పు విధమున నీ భూమి శిస్తు వసూలగుటకు కర్చు యెంతగునో నిర్ధరించుటకు కాదు. ఈ కర్చు పద్దును సాధారణపరిపాలనకగు కర్చుమొత్తమునుండి వేరుచేయను సాధ్యపడదు. భూమి శిస్తును వసూలుచేయుటకు తగిలేకర్చు మొత్తమును భూమిశిస్తువల్ల వచ్చే మొత్తములో తీసివేసినచో ఆదాయము తగ్గినదని చెప్పవలయును. రానురాను పెరిగిపోవుచున్న జీతాలను గమనించినచో వానికి సంబంధించిన లెక్కలను చూచినచో రాష్ట్రప్రభుత్వములకు భూమిశిస్తాక యాదాయముకాదని తోచును. ఎక్సైజుశాఖవల్ల వచ్చు ఆదాయము నిలకడలేనిది. కొన్ని రాష్ట్రములం దీయాదాయము తగ్గు సూచనలు కనబడుచున్నవి. స్టాంపులవల్లవచ్చు ఆదాయము, కోర్టు ఫీజు, స్టాంపుడ్యూటీలు యెక్కువగుటవల్ల కొంచమెక్కువైనది. 1921–25 సం॥లో కోర్టుఫీజు, స్టాంపు డ్యూటీలు యెక్కువ చేయనియెడల రాష్ట్రములయం దీయాదాయముకూడా తగ్గినదనియే చెప్పవలయును. ఇర్రిగేషన్‌వల్లవచ్చు ఆదాయముకూడ తగ్గినది.

ఈ శాఖపై నగు కూలీకర్చులు, సామానుల ఖరీదులు యెక్కు వగుటవల్ల ఈ ఇరిగేషన్ శాఖవల్ల ఆదాయము రాదు. రాష్ట్రప్రభుత్వములకు సంబంధించిన చిన్నచిన్న శాఖలగు సవాళ్ళు (Bettings) అమ్యూజుమెంటు గుత్తలు రోడ్డుటోల్సు ఈ శాఖల వల్ల వచ్చు ఆదాయము గమనింపదగినదికాదు. పై పరిస్థితుల బట్టి 1923–24 నుండి 1928–29 వరకు రాష్ట్రప్రభుత్వముల యొక్క కర్చులు 22% పెరిగినవి. ఆదాయము 4% మాత్రమే వృద్ధియైనది.

కేంద్రప్రభుత్వాదాయము దినములు గడచినకొలదియు యెక్కువైనది. కష్టమ్సువల్ల వచ్చు ఆదాయము 1921–22 సం॥లో 34.41 కోట్ల రూపాయలనుండి 1932–33 సం॥నకు 52 కోట్లు రూపాయలైనది. కేంద్రప్రభుత్వ పరిపాలనకై రైల్వే డిపార్టుమెంటువారిచ్చు కంట్రిబ్యూషన్ 1922–23 సం॥లో 1.22 కోట్ల రూపాయలనుండి 1930–31 (Budget) సం॥నకు 5.74 కోట్ల రూపాయలైనవి. సాల్టు గుత్తలు 1921–22 నందు 6.34 కోట్ల రూపాయలనుండి 1932–33 సం॥నకు 10 కోట్ల రూపాయలైనవి. ఓపియం ఆదాయము 1921–22లో 1.27 కోట్ల రూపాయలుండి 1931–32 సం॥నకు 2 కోట్ల రూపాయలైనవి. ఆదాయపుపన్ను (Incometax) 1925–26 సం॥లో 15.86 కోట్ల రూపాయలనుండి 1932–33 సం॥నకు 18 కోట్లు రూపాయలైనవి.

మాంటాగో ఛెంసుఫర్డు సంస్కరణములద్వారా రాష్ట్ర

ములకు చాల ప్రజోపయోగమైన శాఖలు వచ్చినవిగాని వానికి తగిలే కర్చులకు తగినంత ఆదాయము సున్న. 1933–34 సం॥రపు భారతదేశపు రాజకీయ సంస్కరణముల విషయమై జాయింటు పార్లమెంటరీ సంఘమువారీక్రింది తమ యభిప్రాయ మిచ్చిరి. "రాష్ట్రప్రభుత్వములకు వశపరుపబడిన శాఖ లభివృద్ధి కావలసియుంటే యిందుకయ్యేకర్చులుకూడా అభివృద్ధికావలయును. కేంద్రప్రభుత్వ నిర్వహణమునకు కావలసినకర్చు యుద్ధసమయము లందో లేక ఫ్రాంటియరు అల్లరులప్పుడో యెక్కువగునుగాని. సాధారణముగా నెక్కువచేయ పనిలేదు. ఇంచుమించొక్కచే విధముననుండును. రాష్ట్రప్రభుత్వములకు వచ్చుగుత్త లభివృద్ధి యగునట్టివిగావు కాని కేంద్రప్రభుత్వమునకు రావలసిన గుత్త లభివృద్ధికరములు." రాజధానీప్రభుత్వములు కడచిన 14 లేక 15 సం॥ నుండి ప్రతి సంవత్సరమును లోటు అనుభవించుచున్నవి. 1921–33 సంవత్సరములకు మధ్య రాజధానుల లోటు 23.8 కోట్ల రూపాయలు. ఈ లోటు మొత్తమును కేంద్రప్రభుత్వ వశమందుండు 'రాజధాని అప్పుల ఫండు' నుండి అప్పుతీసుకో బడి పూడ్చబడినది. ఈ అప్పులో 10 కోట్ల రూపాయలు 'మెస్టన్ పరిష్కారము' (Meston Award) ద్వారా రాజధానులు కేంద్ర ప్రభుత్వమున కియ్యవలసిన కంట్రిబ్యూషన్కుగాను అప్పుచేయ బడినది. 1928 సం॥లో యీ కంట్రిబ్యూషన్ లిచ్చు పద్ధతి రద్దు కాబడినను రాజధాను లార్థికముగ నభివృద్ధి చెందలేదు. అందువల్ల రాజధానుల వశమందుండు ప్రజల కుపయోగపడు శాఖలన్నియు

మూలబడినవి. బెంగాలు రాజధానియం దీశాఖల యభివృద్ధి లేనేలేదు. ఈరాజధానిలోనే 1922–23 సం॥న కంటె 1933–34 సంవత్సరమున ప్రారంభవిద్యకుగాను చాల తక్కువ మొత్తము కర్చుపెట్టబడినది.

పై పరిస్థితులకు వ్యతిరేకముగా కేంద్రప్రభుత్వమునకు 1921–31 సంవత్సరములకు మధ్య 10 కోట్ల రూపాయలు మిగిలినవి. ఈ మిగిలిన మొత్తము భారతదేశ ఋణమునకు జమకట్టబడినది. కేంద్రపభుత్వము చేసే కర్చులలో 60% సైన్యమునకే. 1921–22 సం॥లో 61.81 కోట్లున్ను, 1930–31 లో 54 కోట్లున్ను, ఆర్థికమాంద్యముగల 1936–37 సం॥లో 50 కోట్లు రూపాయలున్ను వాస్తవముగా సైన్యమునకు కర్చయినది. దేశమున కేవిధమైన ప్రతిఫలములేని ఈ కర్చును ఏ దేశముగాని భరింపలేదు. సర్ వాల్టర్ లిట్టన్ (Sir Walter-Lytton) గారీవిషయమై యిట్లుచెప్పిరి. "సైన్యమునకుగాను కర్చగుమొత్తము భరింప సాధ్యముకానిది. ఈ విషయ మిండియాలో మరీ అధ్వాన్నము. ఎందుకంటే భారతదేశపు సైన్యములో యెక్కువ భాగము యితరచోట్లనుండి తీసుకొనిరాబడినది. భారతదేశములో సర్కారువారి అన్నికర్చులకంటె ఈసైన్యపుకర్చు చాలయెక్కువ. ఈవిషయములో భారతదేశమును యితరదేశములతో పోల్చిన ప్రపంచమునందుగల సామ్రాజ్యములలో ఇండియాదేశము యేడవది యగును. భారతదేశము ఆయుధములకై కర్చుపెట్టు మొత్తము గ్రేటుబ్రిటనుతప్ప సామ్రాజ్యములోని తక్కిన

దేశములన్నియు కర్చుపెట్టు మొత్తమంతగును. ప్రపంచ యుద్ధమునకు ముందుసంవత్సరములలో భారతదేశములో సైన్యపుకర్చు యితరదేశములకంటె చాలయెక్కువగా పెరుగుచు వచ్చినది. ఈ యభివృద్ధి భారతదేశమునకు ప్రయోజనకారిగాదు. ప్రపంచయుద్ధమువల్ల భారతదేశమున కేమాత్రము ప్రయోజనము లేకపోయినది. కాని యుద్ధపు కర్చులలో సామ్రాజ్యమునందలి యితరదేశములకంటె చాల యెక్కువ భరించినది."

భారతదేశమునం దింత పెద్దసైన్య ముంచుటకు కారణములు 1879 సం॥లో సైన్యపు కమిషన్ (Simla Army Commission) వారిట్లుచెప్పిరి. (1) భారతదేశముపై ఇతరులు దండెత్తిరాకుండ జేయుటకును, అట్లు వచ్చినవారిని వెనుకకు తరుముటకును, (2) బ్రిటిషు ఇండియాలోగాని, స్వదేశసంస్థానములలోగాని, ప్రజలు గావించు అలజడినిగాని, తిరుగుబాటును గాని అణచుటకును యింతసైన్య ముండవలయును." బ్రిటిషు సామ్రాజ్యసిద్ధాంత మభివృద్ధియైన కొలదియు ఈ సైన్యపు విలువ హెచ్చినది. తూర్పుదేశాలలో బ్రిటిషువారి హక్కులను కాపాడుటకీసైన్య మవసరమైనది. ఈక్రొత్తసైన్యమును గురించి 1904-05 సం॥లో సర్॥ ఇ॥ ఎలిస్ (Sir E Elles) గారిట్లు చెప్పినారు. ఏషియాఖండములోని రాజ్యములు విజృంభించి యితరదేశాలను జయించుచున్నపుడు మన మీకొండహద్దులలో దాచుకొని యుండవలసినదేనా? కాదు. భారతదేశమందుండు సైన్యము ఏషియా ఖండములోని సామ్రాజ్యశక్తు లొకటికొకటి విజృంభించి మితి

మీరి పోకుండ సరిసమానస్థితియం దుంచుట కవసరము. భారత దేశములోని అల్లకల్లోల మణచుటకును, లా అర్డరు కాపాడుటకును ఈ సైన్యమున్నదనుట పొరబాటు. ఈ అభిప్రాయము తొలగవలయును." ఈ విషయమునుబట్టిచూడ బ్రిటిషువారు ఏషియాఖండమునందుండు తమ సామ్రాజ్యమును కాపాడుటకీసైన్యమును భారతదేశమున నుంచుకొన్నారని తేలినది. భారతదేశము యీ సైన్యమునకగు కర్చు లచ్చుకోవలయును. 1838—1920 సం॥ల మధ్య పంతొమ్మిదిమార్లు బ్రిటిషువారి సామ్రాజ్యతృష్ణ చల్లార్చుటకై భారతసైన్య ముపయోగింపబడినది. ఈ విషయ మంద రంగీకరించినదే.

కేంద్రప్రభుత్వముయొక్క దండుగకర్చులలో భారతదేశపు ఋణముపై వడ్డీచెల్లించుట యొకటి. 1934 సం॥ మార్చి 31 తేదీకి భరింపరాని భారతదేశపు ఋణము 1210 కోట్ల రూపాయలు. ఇందులో 500 కోట్లు గ్రేటుబ్రిటనులో అప్పు చేయబడినది. 700 కోట్లు ఇండియాలో అప్పుచేయబడినది. 1934-35 సం॥నందు ఇండియా గవర్నమెంటువారి సాధారణఅప్పుపైన 39 కోట్ల రూపాయలు చెల్లింపబడినవి. ఇదివరకే ఈ అప్పు భారతదేశ సౌభాగ్యమునకై చేయబడినదికాదనియు, యీ అప్పు యేరీతిగా పెరిగినదియు చెప్పబడినది. కాని ఒక్కవిషయము మాత్రి మిచ్చట చెప్పవలసియున్నది. ఇండియా సర్కారువారు భారతదేశపు ప్రజల యభివృద్ధి కొంచమైన గమనించక బ్రిటిషు పెట్టుబడిదారుల సౌఖ్యమునకై చేసిన అప్పిది. 1921—22

సం॥లో ఇండియా సర్కారువారు 7.5 కోట్ల రూపాయలు 7%
పడ్డితో ఇంగ్లాండులో అప్పుచేసిరి. ఇదేసంవత్సరమున ఇంగ్లాండులోనే అఫ్రికా, ఆష్ట్రేలియాదేశపు సర్కారువారు 5% వడ్డితో అప్పుచేసిరి. ఇదియొక్క విషయమేకాదు. ఇండియా గవర్నమెంటువారు లండనులోచేయు అప్పులకు సాధారణముగా ఎక్కువ వడ్డి యిచ్చుచువచ్చినారు.

భారతదేశములోని కేంద్రప్రభుత్వమును, ప్రొవిన్షియల్ గవర్నమెంటులును తమతమ సివిల్ పరిపాలనకు ప్రపంచమునందేదేశముగాని కర్చుపెట్టనంత ద్రవ్యము కర్చుపెట్టుచున్నవి. ఈ కర్చు చాల అన్యాయమైనది. భారతదేశములో ఇంపీరియల్ సర్వీసులకిచ్చునంత జీతాలు ప్రపంచమున మరెచ్చటను లేదు. ఈ శాఖలోని ఉద్యోగుల చదువునకును, వారుచేయునట్టి పనులకును యీ జీతము చాల యెక్కువ. లా ఆర్డరు సంరక్షణ సర్కారువారి చేతియందుండుటవల్ల ఈ శాఖకై కర్చుపెట్టుచున్న మొత్తమున కంతులేదు. 1932—33 సం॥లో 60 కోట్ల రూపాయలకుపైగా ఈశాఖా నిర్వహణమునకై కర్చుపెట్టబడినది.

ఇంతవరకు చెప్పిన విషయములబట్టి భారతదేశమునందీక్రింది పరిస్థితు లేర్పడినవి. కేంద్రప్రభుత్వము భారతదేశమును చిరస్థాయిగా పరిపాలించుటకుగాను సైన్యము, ఋణము, సివిల్ పరిపాలన యీశాఖలు తనచేతియందుంచుకొని యీశాఖల నిర్వహణమునకు కావలసిన ధనము చేకూర్చుకొనుటకుగాను దేశములో వసూలుకాబడు ముఖ్యమైన గుత్తలన్నియు తన చేతియందుంచు

కొన్నది. చాల ముఖ్యమైనట్టియు, అభివృద్ధికరమైనట్టియు, గుత్తలన్నియు కేంద్రప్రభుత్వము స్వాధీనమగుటవల్ల రాజధాని ప్రభుత్వములకు డబ్బులేక సదా లోటును అనుభవించుచున్నవి. ఈ ప్రభుత్వముల వశమందుండు ప్రజోపయోగములైన పనులన్నియు డబ్బులేక మూలబడిపోయినవి. భారతదేశమున కేంద్రి ప్రభుత్వము రాజధాని ప్రభుత్వములు చేయుఖర్చులో 25% సైన్యమునకును, 25% ఇండియా ఋణమునకును, 9% పోలీసుకున్ను, జైళ్ళు, న్యాయపరిపాలనకున్ను, 6% సాధారణ పరిపాలనకున్ను, 6% సివిల్ వర్క్సుకున్ను, 4% ల్యాండు రివిన్యూకున్ను. అడవులకున్ను, సముదాయమున కుపయోగపడు విద్యకు 6% న్ను. వైద్యము, ఆరోగ్యమునకు 2% న్ను, నీటిపారుదల యభివృద్ధికి 3% న్ను, వ్యవసాయాభివృద్ధికిన్ని పరిశ్రిమల యభివృద్ధికిన్ని, కర్చుపెట్టు మొత్తము చాల తక్కువ, అదియొక లెక్కగాదు. ముఖ్యముగా గమనించదగిన విషయమొకటి కలదు. ప్రజా సముదాయమున కుపయోగపడు శాఖలకు 15% కంటె యెక్కువ ఖర్చుకాదు. తక్కినదంతయు దేశసంరక్షణ, లా ఆర్డరు పరిపాలన వీనికి కర్చగుచున్నది.

ఈ క్రింది అంకెలవల్ల 1876 సం॥ నుండి ముఖ్యమైన సర్వీసులకున్ను, (Essential Services) అనగా దేశ సంరక్షణ, లా ఆర్డరు పరిపాలనకున్ను, ప్రిజాసముదాయమున కుపయోగపడు సర్వీసులకున్ను (Social Service), యెంతెంత మొత్తము కర్చయినదియు తెలియుచున్నది.

ప్రతి 1000 మంది కగు కర్చు రూపాయలలో:—

| సంవత్సరము. | | ముఖ్యమైన సర్వీసులు. | | సాంఘిక సర్వీసులు. |
|---|---|---|---|---|
| 1876 | .... | 1810 | .... | 159 |
| 1886 | .... | 2108 | .... | 166 |
| 1896 | .... | 2142 | .... | 201 |
| 1906 | .... | 2462 | .... | 277 |
| 1912 | .... | 2514 | .... | 302 |
| 1921 | .... | 4511 | .... | 588 |
| 1929 | .... | 4210 | .... | 876 |

ఈ పై అంకెలవల్ల ఇండియా సర్కారువారి కర్చు యెంత అక్రమమైనదో తెలియుచున్నది. సైమన్ సంఘమున కార్థిక సలహాదారగు (Financial Advisor) సర్ వాల్టర్ లిట్టన్ (Sir Walter Layton) గారు భారతదేశపు ఆర్థిక విషయమై యీక్రింది అభిప్రాయ మిచ్చినారు.

"భారతదేశములోని జనసముదాయమంతయు బీదవారు. భారత ప్రభుత్వము దేశసంరక్షణకున్ను, లాఆర్డరు పరిపాలనకున్ను, కర్చుపెట్టుచున్న మొత్తము చాల భాగ్యవంతములగు పడమటి దేశాలు కర్చుపెట్టు మొత్తమునకు సరిసమానముగా నున్నది." "ప్రజా సముదాయమున కుపయోగపడు సాంఘిక సర్వీసులు, విద్య, ఆరోగ్యము, పరిశుభ్రత, వీనికై ఖర్చుపెట్టుచున్న మొత్తము పడమటి దేశాలకంటె చాల తక్కువ. కొన్ని కొన్ని సమయములలో లేనేలేదనియే చెప్పవలయును."

ఇంతవరకు భారతదేశ ఆర్థిక దాస్యపరిణామముగా దేశముయొక్క యోగక్షేమము లీరీతి నైనవి. 1931 సం॥యొక్క జనాభా లెక్కల ననుసరించి యీదేశములో చదువు వచ్చిన వారు 23,969,751 మగవారున్ను, 4,169,105 మంది ఆడువారు. మొత్తముమీద చదువువచ్చినవారు నూటికి 8 మంది. 1930-31 సం॥ లో ప్రతి 1036 మందికి ఒక బడి వుండినది. ప్రాథమిక విద్యావిషయములో 1,329 మంది కొకబడియున్నది. ఈ సంవత్సరములోనే విద్యకై తలకొక రూపాయ కర్చుపెట్టబడినది. జపానుదేశములో యీ సంవత్సరములో తలకు 11-0-0 లున్ను యునైటెడ్ రాజ్యములో 32 రూపాయలు కెనడాలో రు. 48 లున్ను, అమెరికాలో రు. 65 లున్ను, విద్యకై కర్చుపెట్టబడినది. రష్యాలో (Soviet Union) విద్యకై 11,290,000,000 రూబుల్సు కర్చుపెట్టబడినవి. అనగా చదువుకొనుచున్న ప్రతి యొక్కనికి 158 రూపాయలన్నమాట.

వైద్యము, ఆరోగ్యము, యీరెంటిని ఇండియా సర్కారు వారు సరిగా పోషించనందున దేశములోని పరిస్థితులు సంకట కరములుగా నున్నవి. 1920 నుండి 1930 సం॥ వరకు మధ్య భారతదేశములో జనసంఖ్యలో 1000 మందికి సరాసరి 24.5 మంది చనిపోయినారు. ఈ సంవత్సరములలోనే ఇంతమందికే యునైటెడ్ కింగ్‌డంలో 12.5 మందియు, అమెరికాలో 11.3 మందియు, జర్మనీలో 11.1 మందియు, ప్రాన్సులో 16.3 మందియు, జపానులో 18.17 మందియు చనిపోయినారు.

భారతభూమిలో శిశుమరణ మహాపారము. ఇట్టిది ప్రపంచమునం దెచ్చటను లేదు. దేశము మొత్తముమీద పుట్టిన 1000 మంది పిల్లలలో 230 మంది పుట్టిన ఒక్క సంవత్సరము లోపలనే చని పోవుచున్నారు. ఇంగ్లండు వేల్సులలో 15 మంది చనిపోవు చున్నారు. 1931 సంవత్సరపు జనాభా ననుసరించి భారతదేశ ములో సరాసరి 26.7 సంవత్సరముల కంటె యెక్కువ కాలము జీవించరు. ఇంగ్లండులో 57.6 సం॥ లున్ను అమెరికాలో 56.4 సం॥ లున్ను, జర్మనీలో 49.4 సం॥ లున్ను, ఫ్రాన్సులో 50.5 సం॥లున్ను, జపానులో 44.5 సం॥ లున్ను సరాసరి జీవించు చున్నారు: రోగములవల్ల చనిపోవువారి సంఖ్య భారతదేశమున యెక్కువ. 1918 సం॥న ఇన్ఫ్లూయంజావల్ల 11,000,000 మంది చనిపోయిరి. ఈదేశములో నివారించుటకు సాధ్యపడు కాయిలాలవల్ల యెక్కువమంది చనిపోవుచున్నారు. బెంగాలు యొక్క ఆరోగ్యశాఖ డైరెక్టరుగారు 1927–28 సంవత్సరము యొక్క రిపోర్టులో యీరీతిగా వ్రాసినారు.

ప్రతి సంవత్సరమూ బెంగాలు రాజధానియందే 1,500,000 మంది చనిపోవుచున్నారు. సరాసరి 750,000 పిల్లలు 15 సం॥ వయస్సుకు లోపలనే ప్రతి సంవత్సరమూ చనిపోవుచున్నారు. అనగా చచ్చేవారిలో నూటికి 15 మంది వీరే. ఇట్లు చనిపోవు వారిలో నూటికి 25 మందిని మందిచ్చి బ్రతికింప వచ్చును. కడచిన సంవత్సరములో కలరావల్ల 120,000 మందియు, మలేరియావల్ల 350,000 మందియు, క్షయరోగమువల్ల 350,000

మందియు, డిసెంట్రిక్ జాడ్యమువల్ల 100,000 మందియు చచ్చిరి. క్రొత్తగా పుట్టుపిల్లలలో సరాసరి ప్రతి సంవత్సరమూ 55,000 మంది టీటనస్వల్ల చనిపోవుచున్నారు." కొన్ని సంవత్సరముల క్రిందట యీవిషయమై ప్రత్యేకముగా పరిశ్రమగావించిన సర్ జాన్ మేఘా (Sir Jhon Megaw) గారిట్లు వ్రాసినారు. ఇతను ఇండియను మెడికల్ సర్వీసుకు డైరెక్టరు. "13 మిలియనుల మంది సుఖ జాడ్యము లనుభవించు చున్నారు. క్షయ రోగము రానురాను భయంకరముగ నభివృద్ధి యగుచున్నది. ఈ జాడ్య మనుభవించుచున్నవారిలో 2,000,000 మంది నిరుపేదలు. 6 మిలియనుల మంది రై చీకటివల్ల బాధపడుచున్నారు. 2,000,000 మంది 'రికెట్టు'వల్ల బాధపడుచున్నారు. ప్రతి సంవత్సరమూ 50,000,000 మంది మలేరియావల్ల బాధపడుచున్నారు. కొన్ని సంవత్సరములలో యీ సంఖ్య 100,000,000 మంది యగును.

# ఫెడరల్ రాజ్యాంగ పద్ధతిలో రాష్ట్రముల ఆర్థిక స్థితి

ఈ ఫెడరలు రాజ్యాంగ చట్టము ననుసరించి రాష్ట్రప్రభుత్వములు తమయొక్క బాధ్యతల నెరవేర్చుటకై తగిన ఆర్థిక సదుపాయము లేమైన గావింపబడినవేమో చూతము. జాయంటు పార్లమెంటరీ సంఘమువారు యీచట్టము ద్వారా యేర్పడుస్థితిని పూర్వముండినస్థితినిబట్టి యిట్లు చెప్పుచున్నారు. "కడచిన అనుభవమువల్ల రెండు ముఖ్య విషయములు మనకు కనబడుచున్నవి. ఈ విషయములపై భేదాభిప్రాయము లేదు. (a) రాష్ట్రప్రభుత్వములు న్యాయరీతిగా కర్చుపెట్టుటకు తగినంత ధనము యీ ప్రభుత్వముల కొసగబడలేదు. (b) కేంద్రప్రభుత్వ పరిపాలనక్రిందనుండు శాఖలవల్ల యెక్కువ ఆదాయము వచ్చుచున్నది. ఈశాఖలెప్పటికీ అభివృద్ధి యగునవియే. ఈరీతిగా వచ్చు యెక్కువ ఆదాయములో తమకు కొంతభాగము రావలయునని రాష్ట్రప్రభుత్వములు కోరుచున్నవి. పరిశ్రమల యభివృద్ధికై మిక్కిలి పాటుపడుచుండు బొంబాయి, బెంగాలు యీరాష్ట్రములు కేంద్రప్రభుత్వముయొక్క ఆదాయములో తమకు రావలసిన భాగమునకై చాల తీవ్రముగ పోట్లాడినవి."

పై రెండు విషయముల గుర్తించి 1935 సం॥రపు ఇండియా చట్టమునం దీవిధముగ నిర్ణయింపబడినది. (a) ఆస్థులు

బదలాయింపుపైనను, స్టాంపులవల్లను, టెరిమినియల్ గుత్తల వల్లను, తూనికలపైనను, డ్యూటీలు వేయుటకును, వసూలు చేయుటకును అధికారము ఫెడరేషన్‌కు సంబంధించినది. అయితే యీగుత్తలవల్ల వచ్చుమొత్త మేసంవత్సరమున కాసంవత్సరమే రాష్ట్రప్రభుత్వముల కియ్యవలయును. ఫెడరలు సర్కారువారు తమ స్వంత పనులకై యీమొత్తముమీద సర్‌ఛార్జి విధించవచ్చును.

(b) వ్యవసాయమువల్లగాక యితర ఆదాయములపైన ఫెడరల్ సర్కారువారు గుత్తలు వసూలు చేయవచ్చును. ఈ మొత్తములో కొంత రాష్ట్రప్రభుత్వములకు చేరవలయును. ఈ రీతిగా వచ్చుమొత్తము రాష్ట్రప్రభుత్వముల కిప్పుడే యొసగబడదు. అట్లుచేయుట కొక గడువు నిర్ధరించవలయును. ఈ గడువులోపల వసూలైన మొత్తములో ఫెడరల్ సర్కారువారు తమకు కావలసినంత మొత్తము నుంచుకొని తక్కిన దానిని రాష్ట్రప్రభుత్వముల కొసగవలయును. ఫెడరల్ సర్కారు తనకువచ్చు భాగమును నిధానముగా తక్కువ చేసుకొనుచూ వచ్చి తరువాత రాష్ట్రప్రభుత్వముల వంతు పూర్తిగా చెల్లించవలయును.

(c) జనపనార, లేక జనపనారవల్ల తయారైన వస్తువుల యెగుమతివల్ల ప్రతిసంవత్సరమూ వచ్చు ఆదాయములో అర్ధభాగము (one half) గాని, లేక అంతకంటె ఎక్కువ గాని రాష్ట్రప్రభుత్వములకు చెందవలయును.

(d) లోటువచ్చిన రాష్ట్రప్రభుత్వములకు కేంద్రప్రభుత్వము గ్రాంటు లియ్యవలెను.

పై అంశములపై తమయభిప్రాయ మొసగవలసినదిగా అధికార మియ్యబడిన సర్ ఆటో నీమియరు (Sir Otto Niemeyer) గారు తమ రిపోర్టునం దిట్లు వ్రాసినారు. "రాష్ట్రములలో స్వాతంత్ర్య మేర్పడినతోడనే రాష్ట్రములలోని యార్థిక పరిస్థితులు హెచ్చు తక్కువలు కాకుండుటకుగాను రాష్ట్రప్రభుత్వములకు కావలసినంత ద్రవ్యమవసరము, ఇదివరకు రాష్ట్రప్రభుత్వము లలో వచ్చుచున్న లోటు యికముం దుండరాదు." ఈ విషయము వ్రాసి మరల తానిట్లు చెప్పినాడు. "కేంద్రప్రభుత్వ దృష్టిలో భారతదేశపు పరపతిని కాపాడుటయే ముఖ్యవిషయమై యుండ వలయును. అందుకు తగినరీతి ననుసరింపవలయుననునదియే యీ ప్రభుత్వముయొక్క ఉద్దేశమై యుండవలయును. నా యీ రిపోర్టు వ్రాయునపుడే కేంద్ర ప్రభుత్వపు ఆర్థిక పరిపాలనయొక్క నిలకడమీద దృష్టినుంచినాను. కేంద్ర ప్రభుత్వపు వ్యయము పదేపదే తగ్గించరాదు. ఇప్పటికే యెంత తగ్గింపు కావలయునో అంత తగ్గింపబడినది. ఇంకనూ తగ్గింపబూనుట క్షేమముకాదు." కేంద్రప్రభుత్వము చేయునట్టి కర్చుల నెప్పటికిని, యేపరిస్థితుల యందుగాని తగ్గించరాదను అభిప్రాయము మనసునందుంచుకొని వ్రాసినట్టి రిపోర్టిది. అందు వల్ల యీరిపోర్టును బ్రిటిషు ప్రభుత్వమువారు తూచా తప్పకుండా ఒప్పుకొన్నారు.

ఈ 'నీమియర్ రిపోర్టు' నందలి మరికొన్ని ముఖ్యమైన సిపార్సు లీక్రింద వ్రాయబడినవి,

లోటుపడు రాష్ట్రములకు యివ్వవలసిన గ్రాంటుల విషయమై యితడొక స్కీము తయారుచేసెను. ఈ స్కీము ప్రకారము సింధురాష్ట్రమునకు సంవత్సరమునకు 110 లక్షలును. అస్సామురాష్ట్రమునకు సంవత్సరమునకు 30 లక్షలును, యునైటెడ్ రాష్ట్రమునకు ఐదు సంవత్సరములకు 25 లక్షలు, ఒరిస్సా రాష్ట్రమునకు సంవత్సరమునకు 40 లక్షలున్ను, యీ ప్రకారము కేంద్రప్రభుత్వము యీ మొత్తములను మొదటి సంవత్సరము 47 లక్షలున్ను, రెండు, మూడు, నాలుగు అయిదు సంవత్సరములకు 43 లక్షలున్ను రాష్ట్రప్రభుత్వములకు లోటు భర్తీచేసుకొనుట కొసగవలయును. జనుప ఎగుమతులవల్ల వచ్చు సుంకములో 6½% కొన్ని రాష్ట్రప్రభుత్వముల కియ్యవలయునని చెప్పినాడు.

ఇండియా గవర్నమెంటు చట్టము ననుసరించి కేంద్ర ప్రభుత్వమునుండి రాష్ట్రప్రభుత్వములకు వచ్చు గ్రాంటులో ఆదాయపు పన్ను చాలముఖ్యమైనది. సర్ ఆటోగారు కేంద్ర ప్రభుత్వమునకు వచ్చు ఆదాయపుపన్నులో 50% రాష్ట్రప్రభుత్వములకు పోవలయుననియు, తక్కిన 50% ఫెడరలు సర్కారు ఉంచుకోవలయుననియు, సిపార్సు చేసినారు. కేంద్రప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వములయొక్క వంతును కొంచము కొంచముగా తగ్గించుటకు అధికార మియ్యబడినది. ఈతగ్గింపు రెండు పీరియడ్లుగా విభజింపబడినది. ప్రతి పీరియడ్డుకు అయిదు సంవత్సరముల పరిమితి యున్నది. మొదటి పీరియడ్డులోని ఐదు సంవత్సర

ములలో కేంద్రప్రభుత్వము యీ ఆదాయపు పన్నునుండి తనకు రావలసిన 50% ను రైల్వేలవల్ల వచ్చు ఆదాయము చేరి 13 కోట్లగువరకు, రాష్ట్రప్రభుత్వముల కియ్యవలసిన ఆదాయపు పన్ను లోని భాగమును, కొంతగాని, లేక అంతయూగాని నిలిపివేయ వచ్చును. రెండవ పీరియడ్డులోని ఐదు సంవత్సరములలోకూడా ప్రతి సంవత్సరమూ రాష్ట్రప్రభుత్వముల షేరును తగ్గించవచ్చును గాని యీపీరియడు కడపటి సంవత్సరాంతమునకు రాష్ట్రప్రభుత్వ ములకు రావలసిన వంతు పూర్తిగా యిచ్చివేయవలయును. అందువల్ల ఫెడరేషన్ వచ్చిన పది సంవత్సరములకు తరువాతగాని ఆదాయపుపన్నులో రాజధాని ప్రభుత్వములకు రావలసిన అర్ధభాగము రాదు.

సర్ ఆటోగారి సిఫార్సువల్ల రాష్ట్రములకేమైన ఆర్థి కముగా మేలుకలిగినదా ? లేదు. కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభు త్వముల కిచ్చు గ్రాంట్లు రాజధాని ప్రభుత్వముల పరిపాలనవల్ల వచ్చు లోటులను భర్తీచేయుటకేగాని ప్రజలకుపయోగపడు పనులు చేయుటకు కాదు. రెండవది, కేంద్రప్రభుత్వమిచ్చు జనుప సుం కములోని భాగము చాలతక్కువ. సంవత్సరమునకు 3½ కోట్ల రూపాయలకంటె యెక్కువరాదు. ఈ మొత్తమును రాష్ట్రప్రభు త్వములకు పంచిపెట్టినచో వచ్చెడి మొత్తము రాష్ట్రప్రభుత్వముల యొక్క యేప్రజోపయోగ కార్యమునకును చాలదు. కేంద్రప్రభుత్వ మునకు వచ్చు ఆదాయపు పన్నులో సగము రాష్ట్రప్రభుత్వములకు రావలసి యున్నది. ఈమొత్తము 6 కోట్ల రూపాయలు. ఈ 6

కోట్ల రూపాయలను రాజధానులన్నిటికిని పంచిన వచ్చెడి మొత్త ములో రాజధాని ప్రభుత్వములు ప్రజోపయోగ కార్యములు చేయగలవనుట కల్ల. పోనీ, యీ వచ్చెడి మొత్తముకూడా పది సంవత్సరముల తరువాతగాని రాదు. కేంద్ర ప్రభుత్వము యొక్క ఆర్థికస్థితిని కాపాడుటకును మితిమీరిన కర్చులకు కావలసినంత ద్రవ్యమును సమకూర్చుటకును యీ ఫెడరలు చట్టము సర్వవిధముల ప్రయత్నించుచున్నది. అందువల్ల రాజధాని ప్రభు త్వములపై దయతలచి కేంద్ర ప్రభుత్వము భిక్షము పెట్టునను ఆశకూడా లేదు. కేంద్రప్రభుత్వము తన ఆదాయపు పన్నులోని భాగమును చాల సంవత్సరములకుగాని రాష్ట్రప్రభుత్వముల కివ్వదు.

ప్రపంచ ఆర్థికమాంద్యమువల్ల యిప్పటికే సర్కారుకు వరంబడి తగ్గినది, ఇదివరకు సర్కారువారికి రైల్వేలవల్ల ఆదా యమేగాని 1931–35 సం॥ లకు మధ్య ఐదు సంవత్సరములకు 32 కోట్లు రూపాయలు లోటు వచ్చినది. రైల్వేలకు పోటీ ఎక్కువగుటవల్ల యికముందు లాభమురాదనుటయే నిశ్చయము. ఇంతవరకు కేంద్రప్రభుత్వమునకు వచ్చుసుంకములలో కష్టమ్సు డ్యూటీలు 65% వుండినది. ఈసుంకములుకూడా తగ్గుచున్నవి. ఈ కష్టమ్సు డ్యూటీ వేయబడు వానిలో ముఖ్యముగా చక్కెర, గుడ్డ, వీనిమీద వేయబడు దిగుమతి సుంకములే యెక్కువ, ఈ రెంటిపైన వచ్చు సుంకములు చాలవరకు కొన్ని సంవత్సరము లుగా తగ్గుచూ వచ్చినవి. ఆదాయపు పన్నుయొక్క రేటు యెక్కువ చేయుటవల్ల ప్రభుత్వమున కాదాయమెక్కువైనదిగాని

పన్నుచెల్లించువారి యాదాయ మెక్కువగుటవల్ల గాదు. ఆదాయపుపన్ను చెల్లించు కంపెనీలయొక్క వట్టు ఆదాయము 1930 సం॥ మార్చి నెలకు ముందు పది సంవత్సరములకు 53 కోట్ల రూపాయలు. ఈఆదాయము 1932–33 సం॥ లో 29 కోట్ల రూపాయలైనది. ఇదే విధముగ ఆదాయపుపన్ను చెల్లించు వ్యక్తులయొక్క ఆదాయముకూడా తగ్గియుండును.

కేంద్రప్రభుత్వముయొక్క ఆదాయము దినములు కడచిన కొలది తక్కువగుచుండ వ్యయము మాత్రము సర్వవిధముల నిరాటంకముగా పెరిగి పోవుచున్నది. సైన్యపుఖర్చుగాని, ముఖ్య సర్వీసుల కర్చులుగాని తగ్గునట్లు కనబడదు. ఈకొత్తరాజ్యాంగ చట్టముపైన జరుపబడిన చర్చలయందును, సర్కారువారి మెమోరాండమునందును, రిపోర్టులు తయారుచేయుటయందును దేశమునందేవిధమైన పరిస్థితులనైన యెదుర్కొనుటకుగాను, కేంద్ర ప్రభుత్వముయొక్క ఆదాయ మేమాత్రము తక్కువగాకుండ ఆదాయ మెప్పటికీ అభివృద్ధియగుట కనుకూల ముండవలసినదిగా సూచింప బడినది. సర్ మాల్కాం హైలీ (Sir Malcolam Hailey) గారు తాము జాయింటు పార్లమెంటరీ సంఘమువారికి పంపిన మెమోరాండమునం దిట్లువ్రాసినారు. "భారతదేశములోని సైనికాధికారులు భారతశాసనసభయొక్క బడ్జెట్టు ననుసరించి తమ శాఖకువచ్చు ద్రవ్యము తృప్తికరముగా లేదనియు, ఈమొత్తమువల్ల భారతదేశ సైన్యము అభివృద్ధి చేయుటకు యికముందు యేమాత్రము అనుకూలములు కల్పింప

బడలేదనియు, ఎట్టి పరిస్థితుల యందైన యీ సైన్య మును యేమాత్రము తగ్గించుటకు వీలుపడదనియు చెప్పు చున్నారు." ప్రపంచమునం దన్నిదేశములందును యుద్ధవాంఛ ప్రబలి అల్లకల్లోల మగుచుండు యీరోజులలో భారతదేశమం దలి సైన్య మెక్కువగునుగాని తక్కువగాదు. క్రొత్త రాజ్యాంగ చట్టమునందు కేంద్రప్రభుత్వముయొక్క 'ప్రతిఫలము లేని కర్చులు' (Unproductive Expenditure) సర్వవిధముల రక్షింపబడినవి. కేంద్రప్రభుత్వముచేయునట్టి కర్చులలో 80% కు పై శాసనసభవారి వోటుకూడా కొబట్టదు. ఫెడరలు శాసన సభకు సైన్యపు కర్చులుగాని, ఫించెనులు, అలవెన్సులు, రాజ కీయ మతసంబంధమైన శాఖల యొక్కఖర్చులు, ప్రాంటియరు రక్షణకై చేయుకర్చులు, వార్డు మరియు అప్పు సర్వీసులకగు కర్చులు తగ్గించుటకు వీలులేదు. ప్రస్తుతముండు సివిల్ వుద్యో గస్తుల మాట్లాడించుట కధికారములేదు. స్టేటు సెక్రెటరీగారే ఇండియను సివిల్ సర్వీసుకున్ను, ఇండియను మెడికల్ సర్వీసు కున్ను, ఇండియను పోలీసు సర్వీసుకున్ను కావలసిన వుద్యోగుల నియమింప వచ్చును. వీరికియ్యవలసిన జీతాలు, బత్తాలు, ఫిం ఛనులు అతడే నిర్ణయించును.

కేంద్రప్రభుత్వముయొక్క కర్చులు తగ్గించుటకు సాధ్య ము కానపుడు రాజధాని ప్రభుత్వములకు గుత్త లెక్కువ చేయు అధికారమైన యవసరమని కొందరు చెప్పుదురు, ప్రపంచమునం దెచ్చటను కనివిని యెరుగనంత గుత్తలిప్పటికే యీ దేశ

ములో విధింపబడి వసూలు చేయబడుచున్నవి. గ్రేటు బ్రిటను వలెగాక సర్కారువారు యీదేశములో సైన్యమున కెక్కువ కర్చుచేయుచున్నారు. అందువల్ల భారత ప్రజ కేమాత్రముగాని లాభములేదు. భారతదేశమునుండి 'ఇంటి కర్చు'లని (Home Charges) యేటేట దిక్కుమాలినంత ధనము యీ దేశము విడచి పోవుచున్నది. భారతదేశమం దాదాయపు పన్ను చెల్లించు వారిలో చాలమంది సంవత్సరమునకు రు. 5000 లు కంటె తక్కువ ఆదాయము కలవారే. గ్రేటుబ్రిటనుకంటె ఇండియాలో రు. 5000 వరకు విధింపబడు చున్న ఆదాయపుపన్ను యెక్కువ. భూమి దున్నుకొని జీవించు రైతుపై యిప్పటికే భరింపరానంత శిస్తు విధింపబడినది. ప్రొఫెసర్ బ్రిజినారాయణగారు చెప్పిన రీతిగా భారతదేశములోని రైతు తానియ్యవలసిన భూమిశిస్తుకు గాను తన తిండిలో కొంతభాగ మియ్యవలసియున్నది. ప్రస్తుత మీతనియొక్క దైన్యస్థితియు, అతని ఋణభారమును చూచిన భయమగుచున్నది. అందువల్ల యికముందు రాష్ట్రప్రభుత్వములకు భూమిశిస్తువల్ల యెక్కువ ఆదాయము రాదని స్థిరపడినది. ముందు భూమిశిస్తెంత వరకూ తగ్గించనగునో అంత వరకూ తగ్గించవలయునుగాని యెక్కువచేయుట పాపము. ఆదాయపుపన్ను, మరణ సుంకములు (Death Duties) యెక్కువ చేయవచ్చునుగాని ప్రస్తుతముండు ఆర్థికమాంద్యమువల్ల యిది కూడా సాధ్యపడదు. ఇప్పటికే చిన్నచిన్న ఆదాయములమీద యెక్కువపన్ను విధింపబడినది, ప్రపంచ ఆర్థిక మాంద్యము

వల్ల రైల్వే ఆదాయము హెచ్చునట్లు కనబడదు. అందువల్ల రైల్వేలపైన లోటు తప్పినదికాదు. భారతదేశపు దిగుమతులు తగ్గుటవల్ల దిగుమతి సుంకములు హెచ్చునను యాసలేదు. ప్రజలిప్పటికే కష్టమ్ము సుంకములు ఎక్సైజు గుత్తలు యిచ్చుకొనలేక బాధపడుచుండ వానిని యెక్కువచేయుటవల్ల లాభము లేదు. అడవులు, స్టాంపులు, రిజిస్ట్రేషన్ యీశాఖలపై వచ్చు ఆదాయముకూడా తగ్గునుగాని హెచ్చదు. పై విషయముల బట్టి గుత్తలు వేయుటవల్ల రాజధాని ప్రభుత్వములకు తగినంత ఆదాయమురాదని నిర్ధారణ యగుచున్నది. క్రొత్త రాజ్యాంగ చట్టములో రాజధానుల ఆర్థికస్థితి యధారీతిగా నుండును. కేంద్ర ప్రభుత్వము దేశాదాయములో చాలభాగము కాజేయును. ప్రజల సౌభాగ్యముల కనుకూలించు విద్య, ఆరోగ్యము, వ్యవసాయము, పరిశ్రమలు యివి యేమాత్రమూ అభివృద్ధికావుగాని యిప్పటివలె వుండిన నుండవచ్చును.

# ముగింపు

ఇంతవరకు వివరింపబడిన విషయములబట్టి భారత దేశము బ్రిటిషు సామ్రాజ్యతత్వముయొక్క పేరుప్రతిష్ఠల కేరీతిగా ఆహుతియగుచున్నదో, భారతదేశముయొక్క సహజ సంపద లగు వ్యవసాయము, పరిశ్రమలు, యేవిధముగా ధ్వంసమొనర్ప బడినవో, భారతీయ వ్యాపారము బ్రిటిషువారి ధనతృష్ణ కేవిధ ముగా గురియైనదో తెలిసినది. బ్రిటిషుపరిపాలనలో భారతజాతి తిండిలేక, మలమలమాడి అన్నమో రామచంద్రాయని యరచుచు తినుటకు తిండి, కట్టుటకుగుడ్డకరవై, విచారించువారులేక, విద్యా విహీనతచే దిక్కుతెలియక, రోగములకును, కరవులకును, జాడ్యములకును బలియగుచున్నది. మధ్యరకపు జనులు విజృం భించి బీదరైతులను పీల్చిపిప్పిచేయుచున్నారు. పట్టణములలో వేనకు వేలు వుద్యోగములేక, ప్రజలు పలవరించుచున్నారు.

భారతదేశములో బ్రిటిషువారి నిరంకుశ పరిపాలన మొదటినుండియు ఒక్కటే విధముగా సాగుచున్నది. వైస్రాయి గారికి సర్వాధికార మొసగబడి ప్రజలహక్కులు నాశము గావింపబడినవి. ఇతనిపైన సర్వాధికారి స్టేటుసెక్రెటరీగారు. అతడు పార్లమెంటువారికి జవాబుదారుడేగాని భారతీయులకుగాదు. ఈక్రొత్త రాజ్యాంగ చట్టమువల్ల భారతజాతి కేవిధమగు యార్థిక సౌకర్యమూ కలుగలేదు. వైస్రాయిగారు తన ప్రత్యేకబాధ్యత నెరవేర్చుటకై యెట్టిపనిగాని చేయవచ్చును. అందుకు కాదనువా

రుండకూడదు. పెదరలు శాసనసభకు దేశాదాయముపై నను, వ్యయముపై నను, యేవిధమైన యధికారముగాని, మాటగానిసున్న. రాష్ట్రప్రభుత్వములకున్ను కేంద్ర ప్రభుత్వమునకున్ను మధ్య యేర్పడిన పంపకమువల్ల దేశాదాయమంతయు కేంద్రప్రభుత్వమే మ్రింగివేయుటవల్ల రాష్ట్రప్రభుత్వములకు ఆదాయములేకున్నది.

బ్రిటిషు సామ్రాజ్యమును కాపాడుకొనుట కీదేశమున కొంతమందిని లోబరచుకొన్నారు. వీరు బీదరైతుల పీడించి బ్రిటిషు సామ్రాజ్య తత్వమున కనుకూలముగా తాళము వేయు చున్నారు. బ్రిటిషువారు ప్రవేశపెట్టిన భూమిహక్కు పద్ధతి వల్ల వ్యవసాయముచేయు రైతు జమీనుదార్ల కాళ్ళక్రింద నలిగిపోవు చున్నాడు. జమీందారీ ప్రదేశములో రైతులు జమీనుదారు నౌకర్లే. కౌలుకిచ్చుట, కారణము లేకనే భూమిని వ్యవసాయదారుని చేతినుండి లాగికొనుట, న్యాయమెరుగక, పాపభీతిలేక గుత్తలు వసూలుచేయుట, నేటికిని సర్వసాధారణ ముగా జరుగుచున్నవి. రైతువారీ ప్రదేశములో రైతు అప్పుల పాల్పడి తిండికిలేక తనభూమిని అమ్ముకొనుటవల్ల సాహుకార్లే భూకామందులై వాస్తవమైన రైతును పీడించు చున్నారు. ఇట్టి సాహుకార్లు బ్రిటిషు పరిపాలనలో పెరిగిపోయినారు. వీరి పలుకుబడి యెక్కువైనది. బ్రిటిషువారి యీ నూట యేబది సంవత్సరముల పరిపాలనలో పల్లెటూరి అప్పు పెరిగిపోయినది. ఈ విషయ మిప్పుడు షాహుకార్లకే భయము కల్పించు చున్నది. భారతదేశ పరిశ్రమ లభివృద్ధికాక పరదేశములపోటీకాగలేక మెల్ల

మెల్లగా నశించిపోయినవి. భారతజాతి కిప్పటిలో ముఖ్యమైన ప్రశ్నయొక్కటే. అది భారతజాతియొక్క బీదరికము పోగొట్టుట. దరిద్రదేవత తాండవమాడు చుండుటవల్ల యీక్రింది యంశములు గమనింపదగినవి;—

(1) భారతజాతి యందు ముఖ్యముగా వ్యవసాయ దారు లనుభవింపరాని అప్పులనుండియు, దిక్కుమాలిన గుత్తల నుండియు తప్పించవలయునంటె రైతు నవీనపద్ధతులపైన వ్యవ సాయము చేయవలయును. అందువల్ల రైతునకు పండు పంట యెక్కువగును. చిన్నచిన్న భూభాగముల నొక్కటిగా చేర్చి సరియైన వ్యవసాయదారుకు పంచిపెట్టవలయును, రైతుకు సులభమార్గముల అప్పు పుట్టునట్లు చేయవలయును. 35 మిలి యనుల భూమిలేని వ్యవసాయ కూలీలకు తగినంతభూమి వ్యవ సాయమున కుండవలయును. ఈ పరిస్థితు లేర్పడుటకు ముందు భూమిపైగల శాశ్వతపు హక్కులున్ను, భూకామందులును, కౌలు కిచ్చు పద్ధతియు నెదుర్కొనవలసి యుండును.

(2) పారిశ్రామికకూలీలస్థితి యీదేశమున దుర్భరము. వారికి తగినరీతి కూలి గిట్టునట్లు పనిచేయవలసిన గంటలను నిర్ధరింపవలయును. తగినయిండ్లయందు కాపురముండునట్లును, అన్నివిధములైన సాంఘిక భీమాలు చేయుటకును, వుచిత విద్య యొసగుటకును, కూలీలు సమ్మెకట్టుటకును, ట్రేడుయూనియను లను స్వతంత్రముగా యేర్పరచుకొనుటకును, తగిన సౌకర్యము లు గావించుట కధికార ముండవలయును. కూలీలు రాజకీయ

పార్టీగా యేర్పడి పనిచేయుట కధికార మవసరము.

(3) ఉద్యోగము లేని మధ్యరకపు ప్రజలకు తగిన పనుల కల్పించుటకు ప్రయత్నించవలయును. ఉద్యోగము లేని వారికి జీవన మార్గము చూపవలయును. ఇందుకు చేతిపనులను అభివృద్ధి చేయవలయును.

(4) భారతదేశములో మొత్తముమీద ప్రజల యభివృద్ధి కలుగుటకు జాతీయ పరిశ్రమ లభివృద్ధి కావలయును. వ్యవసాయదారున కతని భూమి మరల వాపసు యివ్వవలయును. ఇందుకు ముందు భారతజాతికి కొన్ని హక్కులవసరము. నిరాటంకముగా వ్యక్తి తన అభిప్రాయములను వెలిబుచ్చుట కధికార ముండవలయును. వార్తాపత్రికలకు స్వాతంత్ర్య ముండవలయును ప్రజలు సభకూడుట కడ్డంకులుండరాదు. ఈ పరిస్థితులు రాక ముందు భారతదేశము, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యము సంపాదించవలయును. ప్రజా ప్రతినిధులకు సర్వాధికారముండవలయును.

యీ క్రొత్త ఫెడరలు రాజ్యాంగపద్ధతిలో పై పరిస్థితులేర్పడు సూచనలు కనబడవు. భారతజాతీయ స్వాతంత్ర్య సమరమునకును బ్రిటిషు సామ్రాజ్య తత్వమునకును యెప్పటికిని పొత్తు కుదరదు. పొత్తు కుదరని హక్కులవల్ల, పొత్తు కుదరని మనస్సు లేర్పడును. బ్రిటీషు సామ్రాజ్యముయొక్క మనస్తత్వము యీ ఫెడరలు రాజ్యాంగచట్టములో సర్వముఖముల వుద్ఘోషించు చున్నది.

ఈ రాజ్యాంగపద్ధతిని మార్చవలయునని దేశమందలి ప్రజ లాతురపడుచున్నారు. భారతజాతీయ మహాసభ యీవిషయమున కంకణము కట్టుకొన్నది. ఈ రాజ్యాంగపద్ధతిని ఆపివేసినంత మాత్రాన ప్రయోజనములేదు. బ్రిటీషు సామ్రాజ్య తత్వపు ఆర్థిక దోపిడినుండి తప్పించుకొనవలయునన్న భారతదేశమునకు స్వాతంత్ర్య మవసరము. భారతదేశము ఆర్థిక స్వాతంత్ర్యమునకు పోరాడుచున్నదనగా రాజకీయ స్వాతంత్ర్యమునకేగాని వేరుకాదు.

---



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA104B153 |
| పుస్తకం పేరు | ఇండియా |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | నో |
| ఖాళీ పేజీలు | i, v, iii, i |
| లేని పేజీలు | నో |
| తయారు చేసినది | kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | నో |
| పరిస్థితి | [illegible] |